# విక్రమనామ సంవత్సర _ ఆషాడ - శ్రావణమాసములు

1940_వ సం॥ ఆగస్టు

| | | |
|---|---|---|
| 1 | గు | ద్వా 4-18 ఆరు 48-55 ది 10-50 ప్రదోషం కావేరిప్రవాహం |
| 2 | శు | త్ర 0-37 చశ 55-27 పున 45-57 ది 17-26 శివరాత్రి |
| 3 | శ | ● 49-5 పుష్య 41-44 ది 4-33 అమావాస్య |
| 4 | ఆ | ప్ర 41-57 ఆశ్లే 36-40 ది 11-2 శ్రావణ శుద్ధం |
| 5 | సో | ద్వి 34-21 మఖ 31-6 ది 3-53 రా 17-54 |
| 6 | మం | తృ 26-39 పుబ్బ 25-28 రా 10-50 |
| 7 | బు | చ 19-20 ఉత్త 20-6 రా 8-8 తిధిద్వయం గరుడ-నాగ-పంచమి |
| 8 | గు | పం 12-28 హస్త 15-18 రా 2-40 షష్ఠితిధి |
| 9 | శు | ష 6-25 చిత్త 11-14 ది 24-30 షష్ఠివ్రతం |
| 10 | శ | స 1-12 అ 56-55 స్వా 8-5 ది 21-34 |
| 11 | ఆ | న 52-41 విశా 5 53 ది 15-41 |
| 12 | సో | ద 51-28 అనూ 4-39 ది 19-37 |
| 13 | మం | ఏ 50-19 జ్యే 4-31 ది 24-48 ఏకాదశితిధి సర్వైకాదశి |
| 14 | బు | ద్వా 50-11 మూల 5-20 ది 1-17 రా 30-5 ద్వాదశితిధి |
| 15 | గు | త్ర 51-10 పూషా 7-13 ది 28-13 సింహేరవిః 51-34 ప్రదోషం త్రయోదశితిధి |
| 16 | శు | చశ 53-15 ఉషా 10-12 ది 20-52 వరలక్ష్మీవ్రతం శూన్యతిధి |
| 17 | శ | ○ 56-27 శ్ర 14-14 ది 25-5 పూర్ణిమాతిధి |
| 18 | ఆ | ప్ర 60-0 ధని 19-18 రా 8-6 శ్రావణ బహుళం ప్రధమతిధి |
| 19 | సో | ప్ర 0-44 శత 25-29 రా 12-20 |
| 20 | మం | ద్వి 6-2 పూభా 32-28 |
| 21 | బు | తృ 12-3 ఉభా 40-9 శే 3-32 చతుర్థితిధి |
| 22 | గు | చ 18-33 రే 48-2 ది 14-6 అతిధి |
| 23 | శు | పం 25-2 అశ్వి 55-39 రా 13-27 క్షన్యాయనం 16-7 పంచమితిధి |
| 24 | శ | ష 30-57 భర 60-0 ది 22-22 |
| 25 | ఆ | స 35-41 భర 2-27 రా 4-21 కృత్తికా గోకులాష్టమి |
| 26 | సో | అ 38-49 కృ 7-57 రా 19-39 మునిత్రయ శ్రీజయంతి |
| 27 | మం | న 40-3 రో 11-44 ది 26-10 |
| 28 | బు | ద 39-7 మృ 13-34 రా 3-43 |
| 29 | గు | ఏ 36-20 ఆరు 13-18 రా 11-27 సర్వైకాదశి |
| 30 | శు | ద్వా 31-39 పున 11-4 ది 29-46 ప్రదోషం |
| 31 | శ | త్ర 25-19 పుష్య 7-10 రా 5-44 శివరాత్రి త్రయోదశితిధి |

# విషయసూచిక



వర్ణచిత్రము : మీరాబాయి




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనారత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

---

దివసనభూఖ్, నీందనహిఁరైనా, ముఖసేకథత్ న ఆవై బైనా।
కహాఁ కహూఁ కఛు కహత న ఆవై, మిలకర్ తపత బఝాయ్ ॥

---

పవలు ఆకలి లేదు,
రేయి నిదురే లేదు,
పెదవిదాటదు మాట,
ఏమిచెప్పుదు? ప్రభూ!
ఎదుట దయతో నిల్వవా?
నా స్వామి,
హృదయతాపము బాపవా?

(నవ్యకళా మీరాబాయ్)

# ★ కాశ్యహార కమలాదేవి

## పరిణతమై, పరిపూర్ణమైన జీవితమును గడపిన ఆదర్శయువతి



### ● జీవిత విశేషాలు ●

విద్వత్కుటుంబమైన ప్రతాపగిరివారి వంశంలో నందలూరు గ్రామమున జన్మించినదీ సుప్రసిద్ధ నారీమణి. తండ్రిగారు మంచి విజ్ఞానశేముషీదురంధురులైన న్యాయవేత్తలవటంవల్లను, సాంప్రదాయ ప్రసిద్ధమైన గొప్ప కుటుంబీకులవటంవల్లను చిన్ననాటనుండి యీమె ఉన్నతభావపూరితమైన వాతావరణంలో పెరిగింది.

ఈమెకు నలుగురు సోదరులు. తల్లితండ్రులకు యీమె ఒక్కతే కూతురు. సోదరులు నలుగురు ఉన్నతోద్యోగాలలో వున్నారు. వారిలో శ్రీ ప్రతాపగిరి రామమూర్తిగారు బొంబాయిలో హిస్టరీ ప్రొఫెసర్‌గా పనిచేస్తూ ఎంతో విఖ్యాతిపొందివున్నారు.

హైందవాచారానుగుణ్యంగా తండ్రిగారు యీమెను 14 వ ఏటనే శ్రీ వేదాంతం కృష్ణయ్యగారికిచ్చి వివాహం చేశారు. శ్రీ కృష్ణయ్యగారు బ్రహ్మసమాజావలంబకులు; ఆయనతో ఈమెకూడా బ్రహ్మసమాజ మతమును అవలంబించింది.

### సాంఘిక జీవితము

శ్రీ కృష్ణయ్యగారు కలకత్తాలో వైద్యపరీక్షకు చదువుచున్నప్పుడు యీమెకూడ భర్తతో కలకత్తా నగరంలో 5, 6 సంవత్సరాలు నివసించింది. శ్రీ కృష్ణయ్యగారు ఉత్సాహవంతులగు యువకులగుటచే, అన్నివిధముల కమలాదేవిగారికి ప్రోత్సాహాన్నిచ్చారు. తత్ఫలితంగా ఈమె మత, సాంఘిక, రాజకీయాలలో ఉత్సాహంగా పాల్గొంటూ, తగువిధముగా సేవచేసింది. బెంగాలీ భాషలో మంచి పరిజ్ఞానం సంపాదించింది. వంగ సోదరీమణులతో చేతులుకలిపి అనేకమైన ఉద్యమాల్లో పాల్గొంది.

తరువాత శ్రీ కృష్ణయ్యగారు కాకినాడలో వైద్యవృత్తి ప్రారంభించినప్పటినుండి, వారి తోడ్పాటుతో కాకినాడయందు మహిళోద్యమాలలో మార్గదర్శకత్వం వహించి పనిచేసింది. శ్రీ కృష్ణయ్యగారు అమోఘమైన 'మెడికల్ ప్రాక్టీసు' తో తూర్పు గోదావరిజిల్లాలో అఖండఖ్యాతి సంపాదించారు. వారి వలెనే ఉత్సాహవంతురాలవటంచేతను, వారి ప్రోత్సాహం వుండటంచేతను వ్యక్తిపరమైన పేరుప్రతిష్టలతో తన కార్యరంగాన్ని తాను నిర్మించుకుని, కాకినాడ మహిళోద్యమాలకు ఒక నూతన రూపు కల్పించింది.

ప్రసవసంబంధమైన కేసులకు భర్తగారితోకూడా వెళ్లి సహాయపడుతూ వుండేది. ఆ కేసులలో అనాథలగు బిడ్డలను ఇంటికి తీసుకువచ్చి తల్లికిమారుగా పెంచి, విద్యాబుద్ధులు చెప్పించేది. తన సంతానముతో సమానముగా అనాథులగు బిడ్డలకుకూడ మాతృమూర్తి కావడంవల్ల వీరి గృహము అనాథలకు స్వగృహమైంది. అందువల్ల వీరి ఇంట్లో ఎప్పుడూ కొంతమంది అనాథపిల్లలు పెరుగుతూనే వున్నారు.

## రాజకీయ జీవితము

ఈమె రాజకీయజీవితము 1921 తో ప్రారంభం. అంతకుముందునుంచి పాల్గొంటూవున్నా, 1923 సంవత్సరంలో జరిగిన కాకినాడ కాంగ్రెసుతో ఈమె వ్యక్తిత్వం దేశవిఖ్యాతమైంది. కాకినాడ కాంగ్రెసుకు సూత్రధారులైన శ్రీ సాంబమూర్తిగారి త్యాగమహిమ ఈమె నాకర్షించింది. వారి ప్రోత్సాహం వల్ల కాంగ్రెసు కార్యకలాపంలో ద్విగుణీకృతోత్సాహంతో పనిచేసింది. కాకినాడ కాంగ్రెసుకు స్వచ్ఛంద సేవికాదళానికి అధిపతురాలై యీమె చూపిన కార్యనిర్వహణశక్తి ఔత్తరాహులను ఆశ్చర్యచకితులను చేసింది. తరువాత కాంగ్రెసు మహిళాసంఘానికి కార్యదర్శినిగా ఖద్దరుప్రచారం అమితంగా చేసింది. తిలక స్వరాజ్యనిధికి నిధులను ప్రోగుచేసింది.

## ఉప్పు సత్యాగ్రహము - 6 మాసములు ఖైదు

1930 సంవత్సరంలో గంజాంజిల్లాలో అమితమైన ప్రచారంచేసి, ప్రజలలో చైతన్యం కలగజేసి, 'నౌపడా'లో, మహాత్ముని ఆజ్ఞానుసారం, ఉప్పుసత్యాగ్రహం చేసింది. దానికి 6 మాసములు సామాన్యఖైదు శిక్ష ననుభవించింది.

రెండు మూడు ఏళ్ల వయస్సుకలిగిన చంటిబిడ్డలను వదిలి ఈమె బందిఖానా నలంకరించడానికి వెళ్లుతూవుండిన నాటి హృదయవిదారక దృశ్యం గంజాం పౌరులు మరువలేరు.

1931 లో కాంగ్రెసు కార్యక్రమం కేవలం అసిధారావ్రతచర్యగా పరిణమించింది. అఖిలభారత జాతీయమహాసభను జరపడానికి వీలులేదని ప్రభుత్వం ఆంక్ష పెట్టింది. అక్కడ ఢిల్లీలో శ్రీమతి సరోజనీదేవి అధ్వర్యాన్ని జాతీయమహాసభ సమకూడింది. ఇక్కడ గుంటూరులో శ్రీమతి కమలాదేవి అధ్వర్యాన్ని జరిగింది. భారతదేశంలో మరి ఎక్కడ ఆ సంవత్సరం జరగనటువంటి మహాసభ ఆంధ్రదేశంలో యీ 'యోధురాలు' అధ్వర్యాన్ని జరిగింది.

అప్పటి ఒక బహిరంగోపన్యాసానికి తిరిగి 6 మాసములు శిక్ష ననుభవించింది. అప్పుడే యీమెకు పక్షవాతం జబ్బు మొదటిసారిగా వచ్చి బాధపెట్టింది. కాని. వస్తుతః కండపుష్టి కలిగిన శరీరదారుఢ్యం కనుక తేరుకుంది.

### కాంగ్రెసు ప్రచారం

1935 లో దత్తమండలాలనుంచి కేంద్రశాసనసభకు అభ్యర్థిగా శ్రీ అనంతశయనం అయ్యంగారు నిలచినప్పుడు, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘమువారి ఆదేశానుసారంగా దత్తమండలాలలో అపారమైన ప్రచారం కావించి, కాంగ్రెసు విజయానికి తోడ్పడింది.

మద్రాసులో శ్రీమతి రుక్మిణి లక్ష్మీపతిగారి అభ్యర్థిత్వాన్ని బలపరచి ప్రచారంచేస్తూవున్న సందర్భములో తిలకుఘాటులో కొందరు దుష్టులు రాజకీయంగా క్రోధం పెంచుకుని యీమెను కొట్టినప్పుడు అతి శాంతంతో భరించింది.

1937 లో జనరల్ ఎలక్షన్సులో యీ త్యాగజీవి చేసిన కాంగ్రెసు ప్రచారం సాటిలేనిది. బొబ్బిలి ఫిర్కాకు యీమెను అభ్యర్థిగా నిలువబెట్టి, తర్వాత కారణాంతరములచే శ్రీ గిరిగారిని నిలువబెట్టినప్పుడు తన అభ్యర్థిత్వాన్ని ఉపసంహరించుకుని, ఆ ఫిర్కాలో శ్రీ బొబ్బిలిరాజాగారికి ఎదురుగా అసమానమైన కాంగ్రెసు ప్రచారాన్ని కావించి, గిరిగారి విజయానికి కారణభూతురాలైంది. తన స్థానం అన్యాక్రాంతమైనప్పుడుకూడ ఎట్టి స్వార్థముగాని, కావేషముగాని లేక, కాంగ్రెసు ఆజ్ఞను శిరసావహించి ద్విగుణీకృతోత్సాహంతో సేవచేసిన త్యాగశీల—కమలాదేవి.

సాంఘికంగా నిత్యం ఏదోవిధముగా సంఘానికి సేవచేస్తువుండడము యీమె కలవాటైపోయింది. హరిజనసేవకసంఘానికి భర్తగారైన కృష్ణయ్యగారు కార్యదర్శిగా కాకినాడలో మంచిమార్పు తీసుకువచ్చారు. హరిజనులను తన ఇంటిలో పనిచేయించుటకు నియమించి యితరులకు మార్గదర్శినియైనది ఈమె.

సాంసారికముగా, యీమెయొక్క చక్కని వంటనేర్పు, చమికీ మొదలైన కుట్టుపనులలో నేత్రానందకరమైన ప్రవీణత వీరి గృహములో ప్రతిఫలిస్తూవుంటాయి. మొక్కల్ని పెంచి, వృద్ధిచేయడం యీమెకు మంచి సరదా. పనివాళ్లకు తలమానికమై నీళ్లుమోసి సమస్త కాయగూరలు దొడ్లో పండిస్తూ గృహప్రాంగణాన్ని నందవనంలాగ పుష్పభర శోభితంగాచేసిన ఆదర్శగృహిణి.

గత మూడు'టరములు'గా కాకినాడ మ్యునిసిపల్ కౌన్సిలర్ గా పనిచేసి, స్త్రీలుకూడా పరిపాలనను దక్షతతో నిర్వహించగలరని రుజువుచేసిన దీమె.

### అస్తమయం

వీరచిహ్నాలు వెల్లివిరిసే మూర్తిత్వం, వేదికమీదనుంచుని ప్రజానీకంలో అగ్నిని రేకెత్తించగల వాగ్ధాటి, యువక, యువతీ ప్రపంచానికి మార్గదర్శినియై కదనుతొక్కించగల ధీరత్వం, కాంగ్రెసుకు నమ్మినబంటై, నిర్మాణకార్య నిర్వహణలో ఆరితేరిన చాతుర్యం, ఒడుదుడుకులు లేక సంసారాన్ని సమరసముగా సాగించుకుంటూ కన్నబిడ్డలను ఆదర్శ భారత యువతీ యువకులుగా తయారుచేయగల చాకచక్యం, దీనజనసేవ మొదలైన సద్గుణ పుంజాలకాటపట్టగు వేదాంతం కమలాదేవిని పక్షవాతం జబ్బు కనికరంలేక కడుపున పెట్టుకుంది—జూలై 14 తేదీ ఆదివారం 5 గంటలకు. చనిపోవుసరికి ఈమెకు 43 సంవత్సరాల వయస్సు. నలుగురు కుమారులు, ఇద్దరు కుమార్తెలు.

తూర్పు గోదావరిజిల్లాకు అఖండమైన ఖ్యాతినిగూర్చిన దుర్గాబాయమ్మ, కామేశ్వరమ్మ, కమలాదేవి—యీ మూర్తిత్రయంలో ధృవనక్షత్రం రాలిపోయింది—మరిలేదు.

# కమలాదేవి ఎప్పటికీ 'మృతజీవి'యే...

## శ్రీమతి దుర్గాబాయమ్మగారి సానుతాపాశ్రువులు

సుప్రసిద్ధ నారీమణి, దేశసేవిక వేదాంతం కమలాదేవి స్వర్గాన్ని అలంకరించింది. ఇందువల్ల ఆంధ్ర నారీలోకానికి, కాంగ్రెసుసంస్థకు తీరనిలోటు వాటిల్లింది.

అయితే ఆమె మరణించినదని నేను భావింపను. ఎందుచేతనంటే, ఆమెయొక్క అగణితమైన దేశసేవాపరంపరలవల్ల ఆమె 'మృతజీవి'గా నిల్చివుంది. ఆమె ధైర్యస్థైర్యాలు, నిర్మాణకార్యదీక్ష మొదలైన సద్గుణపుంజాలతో నూతన కాంతి జ్యోతులను వెదజల్లింది. ఆ జ్యోతులు ఆంధ్ర యువతీమణుల రక్తనాళాల్లో సర్వదా ప్రకాశిస్తూనే వుంటాయి.

ఆమె తన స్వార్థరహితమైన దేశసేవతో, తనకేకాక, ఆంధ్రమహిళా ప్రపంచానికికూడా ఒక నూతన శకారంభమైన చరిత్రను సృష్టించింది.

ఆమె అన్ని విధముల అనుభవములతోను పరిపూర్ణమై, పుట్టిననాటినుండి ఒకేవిధమైన విజయవంతమగు జీవితమును గడపిన ధన్యురాలు. ఆమె జీవితము, జీవితక్రమము, మొదలైనవి సోదరాంధ్రమహిళామణులు అనుసరించుటకు ఆదర్శములు. కళాప్రాభవము, రాజకీయచైతన్యము, సాంఘిక నిర్మాణము, మొదలైన సద్గుణాలు ఒకేవొకచోట కూడివున్న యిటువంటి నారీమణిని సంఘజీవితములో మనం పొందగలిగివుండడం చాలా అరుదు. ఇటువంటి అపురూపమైన పుష్పాన్ని కలిగివున్న ఆంధ్రభూమి ప్రత్యేకంగా చాలా గర్వించవలసివుంది.

ఆంధ్రమాత వీరమాత. ఆమె గర్భాన్ని ఆణిముత్యాలవంటి వీర సంతానం ఉద్భవిస్తూనేవుంది.

ఏదేశమైన, ఆ దేశంయొక్క పుత్ర, పుత్రికామణుల మహనీయవర్తనాలవల్లను, త్యాగచర్యవల్లను, ఔన్నత్యంలోకి వస్తుంది. ఆ ఔన్నత్యం జాతిసల్పే 'వీరపూజ'ల మీదనే ఆధారపడి నిల్చివుంటుంది. ఆ వీరులయొక్క చరిత్రలను మననంచేసుకుంటూ వారి అడుగుజాడల్లో జాతినడిచినప్పుడే ఆ దేశం గొప్పది కాగలుగుతుంది. ఆ ఔన్నత్య 'జ్యోతి' ఆరిపోకుండా చిరంజీవత్వం పొందాలంటే, 'వీరపూజ' నిలిచివుండాలి. ఇది దేశంలో ఎప్పుడు అదృశ్యం అవడం ప్రారంభించిందో అప్పుడే ఔన్నత్యంకూడా క్షీణిస్తుంది.

ఈ విషయంలోనే, ఆంధ్రదేశము వెనకబడిపోతూవున్నదని ఎంతో విచారంతో చెప్పుతున్నాను. వీరనారి కమలాదేవికి జాతి ఎంతో ఋణపడివుంది; దానిని తిరిగి జాతి తీర్చుకోలేకపోయింది. పోనీ, ఏవిధంగానైనా ఆమెను పూజించడానికికూడా నోచుకోలేకపోయింది. ఆమెను గౌరవించడం, మనం మనలను గౌరవించుకోవడమే. ఆ గౌరవం ఆ ప్రత్యేకవ్యక్తికిపోదు, అవి జాతికి ప్రత్యేకతనిస్తుంది, ప్రజ్వలవంతాన్ని కూరుస్తుంది.

ఆమెను అఖండమైన ప్రజ్ఞావంతురాలుగాను, ఒక వీర 'సిపాయి'గాను మనం తెలుసుకున్నాము. ఆమెకు ఏదైన ఒక బాధ్యతాయుతమైన పదవినికూడ ఇచ్చివున్నట్లయితే ఆమెను వాడిమీరిన ఒక రాచకార్యధురీణగా కూడా తెలుసుకొనేవాళ్లము. ఆమె ఖ్యాతి, దేశదేశాలా ప్రాకేది. దానితో ఆంధ్రజాతికి

ప్రత్యేక ప్రాభవం కలిగేది. కాని దానికి మనం పెట్టిపుట్టలేదు. కాలపై పరీత్యమో, లేక మన కానికర్మమో కాని, ఆంధ్రజాతిలో యీ వీరపూజ నశించిపోతూవుండడం గూర్చి మనలను మనం ఏమనుకోవాలో తెలియడంలేదు.

ఏది ఎట్లున్నప్పటికీ, స్వర్గీయ కమలాదేవివంటి ఆంధ్ర నారీమతల్లుల జీవిత విశేషాలు మనం ఆదర్శవంతంగా పెట్టుకున్న నాడు మనజాతి ఆదర్శవంతమై అచంచలమైన గొప్ప భవిష్యత్తును నిర్మించుకోగలదు. ఈ ఆదర్శ సోదరీమణి ఆత్మకు శాంతికలుగుగాక!

## వీరనారీస్మృతి

### కమలాదేవి

బరువైపోయిన పాలనంబడుట పూర్వప్రాభవౌన్నత్యముల్
తొరగన్ గ్రుక్కెడి భారతీయతతికిన్ తొల్లింటిభాగ్యంబు చే
కురగా కాంగ్రెసుజేరి పాటుపడె కన్గొండంచు లోకుల్ సదా
స్థిరభక్తిన్ స్మరియించుచుంద్రు కమలాదేవీ సతీరత్నముక్.
చూపరుల్ గ్రొమ్మన్నడ నాపడ ఉప్పుసత్యాగ్రహంబున చూపినట్టి తెగువ,
కన్నబిడ్డలమీది గారాము నెంచక జైలులో కృశియించు సాహసంబు,
ఊరూరుతిరిగి అత్యుద్రేకపూరితోపన్యాసము లొసంగు ప్రౌఢధాటి,
జస్టిసుపక్షంపుస్తంభంబును జయింప కష్టాలకోర్చిన కార్యదీక్ష,
హరిజనాభ్యుదయార్థమై అనవరతము చాలకృషిసల్పి నుతిగన్న సర్వసమత,
ఆంధ్రవనితలకేకాదు, అఖిల హైందవాంగనాళికి ఆదర్శమయ్యెకాదె!
తల్లివలె దేశసేవచే ధన్యతగన నీమెపిల్లల నీశ్వరుండేలుగాత
జన్మభూమి స్వతంత్రతా సంపదగని యీమె యాత్మకు స్థిరశాంతి యొసగుగాత!

—శ్రీ శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తి బి.ఏ., బి.ఇడి.,

## విజ్ఞప్తి

అఖిలభారత కాంగ్రెసు సంఘము - స్త్రీ శాఖవారు తలపెట్టిన దేశ సేవికల చరిత్ర ప్రచురణకు ఇతోధికముగ తోడ్పడనెంచి, ఆంధ్రదేశమున 1920 సం॥ నుండి స్వాతంత్ర్య సమరమున పాల్గొని సేవచేసిన మహిళామణుల చరిత్ర క్లుప్తముగ వ్రాసి ఛాయాచిత్రములతో సహా పంపిన 'గృహలక్ష్మి'లో ప్రకటించెదము. కాన, పాఠకులను తోడ్పడగోరుచున్నాము.

సంపాదకుడు.

# 'ప్రజాసేవలో పరమార్థము పొందిన జీవయాత్ర'

## శ్రీమతి పొణకా కనకమ్మగారి సానుభూతి వచనాలు

సోదరి శ్రీ కమలాదేవికి స్మృతివాక్యాలు వ్రాయవలసివస్తుందని ఎన్నడు అనుకోలేదు. స్వతంత్ర సమరంలో జయభేరులు మ్రోయించి మాతృదేవతకు పుష్పాంజలులు పట్టెంచిన చేతులతో, దేశభక్తుల అస్త్రమయ బాష్పాంజలులు అర్పింపచేసినది. మబ్బులుగ్రమ్మిన భారత రాజకీయ తారాపథంలో అక్కడక్కడ మెరసే వెలుగుచుక్కలలోనుండి ఒక జ్యోతి పడిపోయినది. స్వర్గీయసోదరి ఆత్మ అమరమై దీపించుచున్నను భౌతికదృష్టిలో ఇది తీర్చుకోలేని లోపము.

ఆ ఉద్యమ విజృంభణము, శాసనోల్లంఘనము, సత్యాగ్రహము, లాఠీచార్జీలు, కారాగృహాలు, శాంతిదేవత విక్రమించి వీరవిహారంచేసిన ఆ రోజులన్ని కళ్లముందు ఒక్కమారు పరుగులెత్తినవి. ఆ ఉత్సాహశక్తి, ఆ దేశభక్తి, ఆ సేవాసక్తి విస్మృతంకానివి. పవిత్రమైన ఆ సమయంలో సహవాసము, ఆ జయిలు జీవితము ఎంతో ఆనందముగ నుండేవి. ఆమె దృఢకాయరాలైనను, అంత ఆరోగ్యజీవికాదు. జైలులో తరుచు అనారోగ్యముగనే యుండెడిది. ఇవి ఏమియు ఆమెను అడ్డుపెట్టలేదు. ఎటువంటి పరిస్థితిలోనున్నను కాంగ్రెసు శంఖారావము వినపడినదంటే, మహాత్ముని ఆజ్ఞ వచ్చినదంటే సర్వసంసిద్ధము. ఏది ఏమైనను లెక్కలేదు. ఏ కష్టనష్టములకును వెరపులేదు. సంకల్పించిన పని జరిగితీరవలసినదే. ఆమె యోధురాలు, ధీరచిత్త. ఆ శౌర్య సాహసములు, సేవాదృష్టి మొక్కవోనివి. ఆ త్యాగము, పట్టుదల శ్లాఘనీయములు.

అది ముచ్చటయైన పెద్ద సంసారము. వచ్చేపోయేవారితో ఎప్పుడు కలకలలాడుతూ ఉండెడిది. విద్యాసంపదలుగల సంస్కారకుటుంబము. స్వేచ్ఛా స్వాతంత్ర్యములకు నెలవైనది. అనుకూలపతి. అనురాగ సంతతి. ఆమె బిడ్డలతల్లియైన నిండు ఇల్లాలు అయినను, ఉత్సాహముతో యువతులను మించి సంచరించెడిది. ఆమె దేశసేవ రాజకీయముగానే కాదు, సాంఘికముగా కూడ పేరుపొందినది. ఆమె హరిజనసేవలో మెప్పు గొన్నది. అనాథశిశువులను తల్లివలె ఆదరించి పెంచినది. వారిలో సొంతబిడ్డలెవరో పెంపుడుబిడ్డలెవరో తెలిసేదికాదు. వారివల్ల ఏదో ఒకవిధముగా ఎవరో ఒకరు సహాయము పొందుతూనే ఉండేవారు. కన్నీళ్లతో, నిట్టూర్పులతో కీర్తిశేషులకు తిలాంజలులిచ్చి సాంత్వనము పొందుటేగాదు మనపని. ఏ జీవి ఏ ఆశాజ్యోతికి ఆహుతి అయిపోయినదో అది లోకశ్రేయమైనదైతే ప్రదీప్తమొనర్చవలసిన బాధ్యత మనయందున్నది. అది యథోచితముగా నెరవేర్చగలిగితేనే వారికి ఆత్మశాంతి, మనకు మనశ్శాంతి. జాతీయవీరుల స్మృతిచిహ్నాలు ముద్రించవలసిన విజయపతాకం అప్పుడు ప్రతిష్ఠితమాతుంది.

ఆ సోదరి జీవయాత్ర చరితార్థమైనది. సర్వదా ప్రజాసేవలో పరమార్థము పొందినది. పతికి, బిడ్డలకు, బంధుమిత్రులకు, తెలుగుభూమికి ఆమె కొరతయైపోయినను, ఆ సోదరి నిండుహృదయముతో వెలితి లేకుండ నిర్యాణము పొందినది. దుఃఖనిమగ్నమైయున్న ఆ కుటుంబమునకు మనశ్శాంతి, ఆ స్వర్గీయాత్మకు పరమశాంతి ప్రసాదించుటకు ఈశ్వరుని ప్రార్థించుచున్నాను.

# 'అచ్చెరువు గొలిపే శౌర్యసాహసాలు'

## శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మగారి పరిశిష్టవాక్యాలు

ఆంధ్ర సోదరీమణుల ఆశాజ్యోతులలో ఒక దీపిక మరుగుపడినది. శ్రీ కమలాదేవి అకాలనిర్యాణము అశనిపాతమై హృదయదారుణమైనది. నిర్విణ్ణులమైపోయినాము. నిజమేనా అనిపించినది. ఆ సేవాపరత, కార్యదీక్ష, ఉత్సాహము మరపురావు. ఆ జైలు జీవితము కళ్లకు కట్టినట్లుంటుంది. పెద్ద సంసారము, 6 గురు బిడ్డలు, భర్తగారు, వచ్చేపోయే బంధుమిత్రులు, తెరపిలేని కార్యకలాపము. ఏమయిననుసరే, ఎన్ని ఉన్నను సరే మహాత్ముని పిలుపు వచ్చినదంటే ఉరికితీరవలసినదే! కాంగ్రెసు ఆజ్ఞాపించినదంటే చేతులు కట్టుకుని నిలబడవలసినదే. ఆ శౌర్యసాహసాలు అచ్చెరువుగొలిపేవి. ఎంతలో ఎంతమాట! ఆ సోదరికి కన్నీటితర్పణము విడువవలసివచ్చినది. ఎంత విషాదకరము!

ఘోరమైన ఈ చావు బ్రతుకుల సంధిసమస్యలో మలమల మాడిపోతున్న ప్రపంచపు ఎడారులలో ఏ అగ్నితుపాను వీస్తుందోనని ఎదుర్కొనవలసిన రోజులలో, ఈ పిడుగులు పడుతున్నవి. గతప్రమాదిఅయినా ఇంత ప్రమాదకరముగా లేదు. ఈ సంవత్సరం ఏ దుర్ముహూర్తాన్ని అడుగుపెట్టినదో గాని అన్ని దెబ్బతే. తాళుకోలేని ఆఘాతాలు.

అమోఘమైన సేవాత్యాగాల్లో, మాతృపాదారవిందములపై ప్రాణాలు పూవుల్లా అర్పింపగల ధీరులు అసంఖ్యాకంగా వెలువడవలసిన ఈ తరుణంలో ఉన్నవారినే వెలితిచేయుచున్న విధినేమనాలి? సంపూర్ణ స్వాతంత్ర్యానికి అతృప్తనయనాలతో ఎదురుచూస్తున్న ఆ ఉద్విగ్నహృదయాల దీర్ఘనిశ్వాసములాయివి? ఈ పాంచభౌతిక శరీరంతో పొందలేని పరమాశయాన్ని ఆత్మశక్తితో సాధించడానికి తనువులు చాలిస్తున్నట్టున్నది. లేకపోతే ఏమిటి ఈ దుర్ఘటనలు? లోకంలో ఏజీవి కొరతపడినా ఆ కుటుంబానికి తీరని లోపమే. కాని సంఘాన్ని, దేశాన్ని కుటుంబంగా చేసికొన్న విశ్వజీవులుంటారు కొందరు. అట్టివారిలో ఒకరు మా సోదరి కమలాదేవి. ఈ భౌతికదృష్టికి ఇక ఆ సోదరి కనుపడదు. ఆ హృదయం ఏ సానుభూతితో ప్రశాంతి పొందుతుంది? కేవల బాహ్యచిహ్నలే కావు. ఆ సేవాదీక్ష, కార్యపరతంత్రతలో కలుగుతుంది. ఐహికంగా చేయవలసిన ఆ సేవాభారంకూడా మనమీద పడినది. స్వర్గీయుల చితులమీద సానుభూతి పుష్పాలతో, స్మారకసభలతో మన బాధ్యత తీరదు. దేశభక్తుల యథార్థస్మృతి మన హృదయాల్లో నెలకొల్పితే అది నిత్యజీవంగా ఉంటుంది.

ఆత్మపతికి అర్ధాంగి దూరమైపోయినది. బిడ్డలకు అమ్మ కరువైపోయినది. మిత్రులకొక హృదయము జారిపోయినది. తెలుగుభూమిలో, త్యాగశీలురైన మహిళామండలిలో ఒక వెలుగుచుక్క రాలిపోయినది. ఆ సోదరి జీవితం ధన్యమైనది. చదువు సంపన్నతలుగల కుటుంబం. యథాశక్తి దేశారాధనలో శరీరం అర్పించింది. అనుకూల దాంపత్యము. ఆర్యస్త్రీలభిలషించే పుణ్యసాధ్వీ మరణము. ఆ సోదరి ఆత్మశాంతికి, ఆ కుటుంబం మనశ్శాంతికి అశ్రుతర్పణంతో పరమేశ్వరుని ప్రార్థిస్తున్నాను.



బ్రిటిషు యుద్ధ విమానం బాంబులుతీసికొని బయలుదేరుతూ వుంది.



యుద్ధం ప్రారంభమైన తర్వాత లండన్ నగరంనుంచి బాలబాలికలను పల్లెలకు పంపించివేశారు. పల్లెలకుపోయి ఊరికే కూర్చోకుండా ఆయువతులు వ్యవసాయంలో కృషి చేస్తున్నారు.



బొంబాయిలో ఇటీవల జరిగిన నేషనల్ ప్లానింగు కమిటీ సమావేశంలో స్త్రీలు కొన్ని ముఖ్య విషయాలు చర్చించారు.

# ★ ఎప్పటికో జ్ఞానోదయం…!

● శ్రీ కనుపర్తి వరలక్ష్మమ్మ

"మనకు నూరు ధర్మోపదేశాలు చేసి, తనకు వ్రేళ్ల ఉంగరాలు, తనభార్యకు కంఠహారములు అర్థించే గురువు యేమాత్రపు వేదాంతో విచారించాలె. స్త్రీలు గురువుయొక్క నైతికస్థితిని తెలుసుకోకుండా వారిమాటలచే వంచితులు కాకూడదు మోక్షం ఆడంబరాలలో లేదు; ముమ్మాటికీ లేదు."

దాదాపు రాత్రి యెనిమిదిగంటలవఱకు ఎక్కడనో ఉగాదిపండువు వినోద కాలక్షేపాలతో ప్రొద్దుపుచ్చి అప్పుడే యింటికి చేరుకున్నాడు రాఘవరావు. రాజేశ్వరికూడా పిల్లల్ని వెంటబెట్టుకొని అప్పుడే యింటికి వచ్చింది. రాఘవరావు ఆమెనుచూచి నవ్వుతూ,

'సంవత్సరాది పండుగనాడు ఏపనిచేస్తే అదే ఏడాదిపొడుగునా వెంటాడుతుందంటారు. ఇక ప్రతిరోజూ నీవు యింటికివచ్చేవేళ యిదే అవుతుందేమో కొంచెం పెందలాడే యింటికి రాకపోయినావా?' అన్నాడు.

పెనిమిటి మాటలకు రాజేశ్వరి వెన్నెలవిరిసినట్లు కిలకిలానవ్వుతూ 'పైకి సంస్కర్తలవలె మాట్లాడుతూ ఉంటారుగాని, ముసలమ్మలచేదస్తపు మాటలమీద మీకుగూడా వల్లమాలిన నమ్మకమున్నదే' అన్నది.

'అవును. ఇవి ఉగ్రపాలతో రంగరించి పెట్టినవిగాని సామాన్యమైనవా? మహా నాగరికమైన పాశ్చాత్య ఖండాల్లోనే నల్లపిల్లి శకునాలు పోలేదు, ఇక మనదేశంలోనా? అయితే యెక్కడనుంచి రావడము' అన్నాడు రాఘవరావు.

'మంగళకరమైన సంవత్సరాది పండువుగదా ఒక్కమాటు భగవద్దర్శనం చేసుకుందామని దేవాలయానికి వెళ్లాను. కాని యేంప్రయోజనం?

"ఏమి? భగవద్దర్శనంకాలేదా? ఎడంచేతిలో డబ్బులపళ్లెము, కుడిచేతిలో శఠగోపురము పట్టుకొని అర్చకుడు అప్పలాచార్యులు వచ్చినవారికందఱికీ భగవద్దర్శనము చేయించడానికి సిద్ధంగానే ఉంటాడుగా"

"లోపలిదాకా వెళ్లగలిగితే భగవద్దర్శనం చేయించడానికి ఒకరు కావాలా?"

'అయితే వెళ్లలేదు?'

'గుడి ఆవరణమంతా జనమే, ఎట్లా వెళ్లేది?'

'నీవలెనే పండుగ పుణ్యకాలమందు భగవంతుని సేవించవలెనని వారందఱికీ తలంపు కలిగింది కాబోలు.'

'అయితే నయమే.'

'మరెందుకు మూగారు? ఏదైన ఉత్సవమా?'

'హరికథ చెప్పుచున్నారు.'

'పోనీ అదే కాలక్షేపువిని రాకపోయినావా? అది మాత్రము పుణ్యము తక్కువగా యిస్తుందా? ఈ కాలంలో భజనలు, పురాణాలు, హరికథలూ అంటే మఱీ అరచేతిలో వైకుంఠము చూపేవేగదా.'

'అదైనా వినవిస్తేగదా.'

‘ఎవరు వినవివ్వలేదంటావు?’

‘ఒకరని పేరేమిటి. అందఱూ అందులో భాగస్థులే. మాటలు చెప్పుకునే ఆడవాళ్లూ, మందలించే మగవాళ్లూ, గంతులుపెట్టే పిల్లలు, పాలకేడ్చేపసిబిడ్డలు, నామసంకీర్తనలు చేయించే హరికథకుడు అందఱూ ఆ చప్పుడుకు కారణభూతులే. అయితేనేమి? ప్రతి ఒక్కరికీ తాము యితరులను “ఊరుకోండమ్మా ఇంటి ముచ్చటలన్నీ యిక్కడనేటమ్మా” అని మందలించడము గూడా ఆ విపరీతశబ్దానికి కారణమౌతుందని తెలియదు. ఇతరులందఱూ అజాగ్రత్తగా అప్రస్తుత సంభాషణలుచేస్తున్నట్టు తాము మాత్రము శ్రద్ధగా మౌనంగా కూర్చుని వినదలచిన వారైనట్టూ భావించుకొని ప్రక్కవారిని మందలిస్తూ ఉంటారు. అదే పది మంది అనడంతో పెద్దధ్వని బయలుదేరుతుంది. అసలు కథ అగందరగోళంలో లీనమైపోతుంది.’

‘నిజమే ఏదైనా ఒక ఉపన్యాసంగాని, పురాణంగాని హరికథగాని, వినడానికి వెళ్లేవాళ్లు ఒకరిని మందలించడానికైనా మాట్లాడమని యింటివద్దనే శపథంచేసుకొని వెళ్లితే బాగా ఉంటుంది. అయినా మీ ఆడవాళ్లు చేరినచోట సద్దులేకుండా ఉండదులే. మా పురుషులసభైతేనా? ఎంత నిశ్శబ్దంగా ఉంటుంది. చీమ చిటుక్కుమంటే వినబడేటట్లుంటుంది.’ -

‘అవును లెండి మేమూ నిక్కచ్చిగా ఒక్కొక్కరమే వెళ్లితే మాసభమాత్రం ముచ్చటగా ఉండకేమి? మీలో ప్రతి ఒక్కరూ పసిబిడ్డలను మాకు వదలి, ఒక్కొక్కయొడ బిడ్డను వెంటబెట్టుకొని ఒకమాటు ఒక సమావేశానికి హాజరై చూడండి, మీ సమావేశ మెంత ముచ్చటగా ఉంటుందో.’

‘నీకు మీ ఆడవాళ్లనంటే ఊరికే కోపపడతావుగాని, నిజానికి మీ మాటలకు పిల్లలొక్కరేనా కారణం? నిజం చెప్పు. ఇవాళ పండుగ కావడంచేత ఎంతప్రొద్దువేళ లేచారో, ఏయేపనులు చేశారో, ఎన్నెన్ని పిండివంటలు వండారో, చీరలేమికొన్నారో, రవికలేమి కుట్టించుకున్నారో, నగలేమి పెట్టుకున్నారో, పెనిమిటేమి కోపబడ్డాడో, పిల్లలేమి పేచీలుపెట్టారో, అన్నీ అక్కడ వెళ్లబోసుకోవలసిందే గదా. అందువల్లనే యివ్వాళ మఱీ మాటలసందడి యెక్కువై ఉండాలె. నూరుమంది కూడనీ, నిజానికి మాకీ మాటలుంటాయా?’

‘నిజానికి మీరు చేసిందేమీ ఉండదుగా’ అన్నది వెంటనే రాజేశ్వరి. రాఘవరావు పక్కున నవ్వాడు.

‘ఇంతకు మావాళ్లకు మతిలేదు. ఈ స్త్రీలవల్లనే సందడి, అల్లరి, గొడవ అని మగవారంతా ఒక్క విధంగా ఆక్షేపిస్తూఉంటే, వీళ్లు ఆ సమావేశాలకు పోకుండా ఉండరాదూ? మాయ పుణ్యాపేక్ష వీళ్లను ఉరుకు లెత్తిస్తుందాయెను.’

‘పుణ్యాపేక్షణకు, దయాసత్యశౌచాదులకంటె, నిరుపమాన సాధ్వీధర్మంకంటె, అతిథి అభ్యాగతి పూజకంటె, భగవదారాధనకంటె, భర్తృశుశ్రూషకంటె, బిడ్డలసేవకంటె ఈ హరికథలు యెక్కువ పుణ్యమిస్తాయా? ఆ హరికథకుడు తానేదో పరమభాగవతశిఖామణి అయినట్టూ తాను కాస్తంత భగవన్నామం ఆవినవచ్చిన వారిచే చేయిస్తేనే తానూ వారూ స్వర్గానికి సోపానాలు కట్టుతామన్నట్టూ, తనకేమీ యూహ లేనట్టూ మాట్లాడుతూనే ఆడవారి జడలో సూదులు, సిగలో పూవులు, చెవులనూగే లోలకులు, పైకిపోయిన రవికలూ వర్ణిస్తూ ఉంటాడు. ఆ పరమభాగవతుడిట్లూ పరిహసిస్తూఉంటే మీ ఆడవాళ్లంతా బిడియం లేకుండా తమ్ముగాదన్నట్టూ, ఆ ఆక్షేపణలకుగురి అయిన స్త్రీజాతి వేరే యెక్కడో తమకు సంబంధం లేకుండా ఉన్నట్టూ, తామమాత్రం ఉన్నతోన్నత ఉత్తమశ్రేణికి జెందిన స్త్రీలైనట్టు, విని ఆనందిస్తూ ఉంటారు.’

'నిజమే యీ పురాణాలు పుణ్యకథలు చెప్పే వారికి స్త్రీల నాక్షేపించడం మహాజాస్తి. నాకే అధికారముంటే యీ హరిదాసులు యిటువంటి అప్రస్తుతప్రసంగాలు చేయకుండా...'

'అవును, హరికథకులను శిక్షిస్తావు. అంతే మీ ఆడవాళ్లను మాత్రము పోకుండా ఆపలేవు. ఈ దండన ఎట్లా ఉన్నదంటే, మిఠాయి, కొనుక్కోకుండా మా అబ్బాయిని మేము ఆపలేము. ఊళ్లో మిఠాయి అమ్మకం జరగకుండా దుకాణాలను కట్టిపెట్టించమన్నట్లున్నది. అసలు ఈ హరికథలకు పురాణాలకు పోషకులు మీ స్త్రీలే. మీరు బాయికాట్ చేస్తే, నీరుపెట్టడం మానితే చేను యెండినట్టుగా, ఈ కాలక్షేపాలన్నీ వాటంతట అవే సన్నగిలి ఊరుకుంటాయి. కాని మీ స్త్రీలు జరిపే సమావేశాలకన్నా వీటికే అధికంగా మూగుతూ ఉంటారు. ఏ వెట్టి పుల్లయ్య చెప్పినమాటలను శిరసావహిస్తూ ఉంటారు. అన్నట్టు యివ్వాళ మీ సమాజంలో సంవత్సరాది సమావేశం జరిపారుకదా ఏమాత్రం స్త్రీలు వచ్చారు?'

'పాతికమందో...ముప్పైమందో...'

'మరి హరికథవద్దనో కొన్ని వందలమంది ఉండి 'ఉంటారుగాదూ.'

'ఉన్నారు.'

'స్త్రీలచే స్థాపింపబడి, స్త్రీల అభ్యుదయము నిమిత్తము స్త్రీలచే నిర్వహింపబడుతూఉన్న స్త్రీ సమావేశాలకు వ్రేళ్లమీద లెక్కింపబడే మాత్రపు స్త్రీలు మాత్రమే రావడమూ, ఆ వెక్కిరికొక్కిరి కథలు చెప్పే పురాణాలకూ, హరికథలకూ స్త్రీలు తండోపతండాలుగా రావడమూ—తప్పు ఎవరిదంటావు?'

'పుణ్యం దప్ప మనుష్యులు మఱి దేనిని ఆశించగూడదనీ, ఆపుణ్యము యిటువంటి పురాణాలు, హరికథలు, భజనలు, వేదాంత విచారణలూ, గురు శుశ్రూషలు వగైరాలవల్లనే వస్తుందనీ నూరిపోసిన తప్పెవరిదో వారిదీ. అజ్ఞానులు అమాయకులు అవిద్యాంధకారమగ్నలూ అయిన వారిమాట యెందుకు? అన్ని విషయాలు చక్కగా తెలిసిన మీ పురుషులలో సైతము ఆ పురాణాలకు, పుణ్యకథలకు పంపినంత ధైర్యంగా తమ స్త్రీలను స్త్రీ సమాజాలకు పంపగలవారెందరున్నారో చెప్పండి? స్త్రీ సమాజాలకు తమ స్త్రీలు వెళ్లినట్లైతే వారిలో యే విజ్ఞానదీప్తి ప్రకాశిస్తుందో, ఏ స్వాతంత్ర్య కాంక్ష రేకెత్తుతుందో, ఏ సంఘీభావ మేర్పడుతుందో, అందువల్ల తమ స్వార్థానికేమి ముప్పమోఅని వారికి భయం. అందువల్ల యే ప్రమాదమున్నా తమ ఆధిపత్యానికేమీ ముప్పముండదుగదా అని తమ స్త్రీల నిట్టి కాలక్షేపాలకు మగవారు పంపుతూ ఉంటారు. సనాతన సాంప్రదాయాలమీద ఉండే గౌరవమూ, పుణ్యంమీదఉండే అపేక్షా మావాళ్లకి అసభ్యతను గోచరింపకుండా చేస్తున్నది. ఎప్పటికో జ్ఞానోదయం...!'అని నిట్టూర్పువిడిచింది రాజేశ్వరి.

## క్షమార్పణ

దినమునకొక పూటయును గంజిలేమిచేఁ జిక్కి వెన్నంటిన డొక్కతోఁడ
కటితలంబేనియుఁ గప్ప చేలములేక విచ్ఛిద్రమౌ గోఁచి పేల్కతోఁడ
చలికి నెండకు నింత తలదాచుకొన నీడఁ గానక కృశియించు మేనితోఁడ
సంఘతృణీకృతజాతి హైన్యతఁగల్గు నిర్బంధబానిస వృత్తితోఁడ
సంఘ సేవయొనర్చు పంచమసహోదరా! యికన్మమ్ము క్షమియింప రాదటయ్య!
నీయుసురుగొట్టియే కాదె నిశ్చయంబు హైందవావని పారతంత్ర్యమ్ము గుడుచు!

—శ్రీ కొండపల్లి సుభద్రాంబ.

# ★ పూర్వకవయిత్రి గంగాదేవి ★

'మధురావిజయ' రచనలోని మాధుర్యము

●

— శ్రీ —

కొత్తపల్లి వెంకటరత్నం

> వాఙ్మయ ప్రపంచములో స్త్రీలకు సంబంధం చాలాతక్కువ. ఈదౌర్బల్యం ప్రతివాఙ్మయానికి వున్నది. గార్గి, ప్రాతిధేయి, అవన్తి సుందరి మొదలగు ప్రాచీన సంస్కృత కవయిత్రులతో సరితూగగల స్థానము పూర్వకవయిత్రి 'గంగాదేవికి' కూడా వున్నది.

గంగాదేవి సంస్కృతమున మధురావిజయ (వీరకంపరాయ చరిత)మనే గ్రంథాన్ని రచించింది. ఈమె ఏ పండిత కుటుంబానికి జెందినదికాదు. ప్రాజ్య సామ్రాజ్యాధినేతయైన వీరకంపరాయని భార్య (బుక్కరాయని కోడలు) యని తెలుస్తోంది. దానికి ఆమె గ్రంథ మందలి ఉక్తియే ప్రబలసాక్ష్యం. 'అథకంపన్నపో పికృత్యవిత్......................అవదత్ సవిధే స్థితాంప్రియాంభువి' గంగే 'త్యభినందితాహ్వాయామ్॥ (7 స. 39 శ్లో.)' దీనివల్ల గంగాదేవి కంపన్నపతి భార్యయనియు తరువాత విషయాన్నిబట్టి (40. శ్లో.) ఆమె కవయిత్రి అనిగూడ స్ఫురించుచున్నది. సామాన్యంగా భోగలాలసత్వం, అలసత్వం, సింగారం ప్రదానంగాగల్గి, యీలోకమే తెలియకుండు, రాజకుటుంబంలో ఉద్భవించియు ఈమె మేటి కవయిత్రియై వెలయుట అసామాన్యము, అశ్చర్య జనకము. ఈమె మిగుల సౌజన్యయుక్త, సరళహృదయ. ఆ విషయము గ్రంథాన్నిబట్టే తెలుస్తుంది. ఈమెకు శైవమత ప్రవర్తకుఁడు క్రియాశక్తి గురువు. సారస్వత గురువు విశ్వనాధకవి. "చిరంసవిజయీ భూయాద్విశ్వనాధః కవీశ్వరః యస్య ప్రసాదాత్సార్వజ్ఞంసమిద్ధే మాదృశేష్వపి." అని ఆమె నుడివల్ల తెలుస్తోంది.

విశేష మేమంటే తనభర్త చరిత్రనే తాను రచించుట. స్వీయ చరిత్రలను వ్రాసికొనడ మున్నదిగాని భర్తల చరిత్రలను పత్నులు వ్రాయడం సామాన్యంగా కనబడదు. సామాన్యంగా చాలామంది పురుషులకుగూడ అసాధ్యమైన ఈ కార్యానికి ఒక స్త్రీ, విశేషించి రాజపత్ని పూనుకొని రచించిందంటే ఆశ్చర్యం కదూ? ఆ కాలంలో స్త్రీ విద్యా ప్రాముఖ్యం లేకపోయినా ఈమె రాజ కుటుంబములోనిది గనక శ్రద్ధవహించి తలిదండ్రులు తగిన గురువుల నియోగించి విద్య చెప్పించి యుందురు. దీనిని బట్టి రాజ కుటుంబాల్లో చాలాకాలంనుంచి విద్య వున్నదని తెలుస్తోంది.

ఈ వంశంలో శివ భక్తిమెండు. ఈమెకు గూడ శివునియందు దృఢమైన భక్తి. అందువల్ల ఇతర దేవుల పేర్లుగూడ తలపలేదు. అక్కడక్కడ శివునే ఉపమానముగా గూడ గ్రహించింది.

"త్రిలోచన మివాపర" మని, "పశుపతిరి వనేత్రైః......త్రిభిరపి.........తైస్తనూజైరభాసీత్త" నీ, (2. 42) "దేవా యీనామ తస్యాసీత్.........శంకర స్యేవ పార్వతీ" (1. 73)

అని, రాజ వర్ణనయందుగూడ "మాతేస్త్ర్యంబక పాదుకాం............భూపామమంస్త" అనీ, శివుని ఉపమానత్వమూ, రాజునకుగూడ శివభక్తియూ క్రమముగా తెలియుచున్నవి.

ఈమె మిగుల వినీత. ఆ విషయమును కవిస్తుతియే చెప్పక చెప్పుచున్నది. నిజంగా ఏతత్కావ్యంలో ఇదొక వైశిష్ట్య మనక తప్పదు. సామాన్యంగా ఏకవులైనా, ఇరువురు మూగురు కవులను స్మరిస్తారు గాని దీనిలో వలె ఇంతమంది కవులను స్మరింపరు. ఈమె శివ భక్తురాలు గనక ముందు విఘ్నేశ్వర, మహేశ్వరాదులను, తరువాత అది కవియగు వాల్మీకిని, అటుపిమ్మట, వ్యాస కాళిదాసాదులను స్తుతించినది. ఆతరువాత క్రమంగా బాణ, భారవి, దండి, భవభూతి, కర్ణామృత కవి, తిక్కయ, అగస్త్య, (విద్యానాథ) గంగాధర, విశ్వనాథాదుల యథావిధిగా స్తుతించింది. పురుషుల్లోగూడ వన్నెకెక్కిన కవులు చాలా అరుదు.

ఆ విషయమును "విరలాః కవయోలోకేసరలాలాపవేశలాః" అని గంగాదేవిగూడ బలపఱచుచున్నది. అట్టియెడ ఈ యన్నులమిన్న భావిమహిళామండలికి ఆదర్శార్హమైన ఈ పనికి పూనుకోవడం మిక్కిలి ప్రశంసాపాత్రము.

## ● మధురావిజయము విశిష్టత ●

సంస్కృత వాఙ్మయంలో స్వకపోలకల్పితం, ఖ్యాతం, మిశ్రమ, నియితి వృత్తము(Story) మూడు విధములు. అందులో పురాణేతిహాసమును గ్రహించి రచించిన గ్రంథాలే యెక్కువ. మధురావిజయము చారిత్రక (Historical) కావ్యము. ఇటువంటి గ్రంథాలు సంస్కృతంలో చాలా అరుదు. ఇది యీ గ్రంథాని కొక వైశిష్ట్యం. దీనిలో కథాభాగం చాలాతక్కువ. ఎక్కువగా వర్ణనలతోనే గడిచింది.

అసలు కథ - విద్యారణ్యుని సహాయముతో హరిహరరాయలు, బుక్కరాయలు విజయనగర సామ్రాజ్యాన్ని స్థాపించారు. హరిహరరాయల యనంతరం బుక్కరాయలు రాజ్యానికి వచ్చాడు. అతని తరువాత, అతని పుత్రుఁడు 'వీర కంపరాయలు' రాజయ్యాడు. అతని రాజధాని 'విజయ' అని యిందు వర్ణింపబడింది. అదే సుప్రసిద్ధమైన విజయనగరము. బుక్కరాయలు, వీరకంపరాయలు, 14 వ శతాబ్దములో రాజ్యాన్ని పాలించారు. వీరకంపరాయలకూ, మహమ్మదీయులకూ యుద్ధాలు సంభవించాయని ఈ క్రింది వానివల్ల తెలుస్తూన్నది.

"కంపంక్షితీంద్రం యవనాధిలాజః ప్రత్యగ్రహీద్వృత్ర ఇవామరేంద్రమ్" "...కంపనృపోఽభ్యనందీద్వీరస్సురత్రాణ (సుల్తాన్) ముదగ్రశౌర్యః" "అంధ్రాంధకారక్షయతిగ్మ భాసోబాణా ముంచద్యవనే నరేంద్రః" ఇటువంటి వింకావున్నవి. చివరకు కంపన్నపతే యుద్ధంలో జయించాడు.

మధురావిజయకావ్యం అంత ప్రాచీనం కాకపోయినా, ఎందువల్లనో తాళపత్రప్రతినుంచి చాలా భాగ ముత్సన్నమై పోయింది. అందువల్ల ఇది యెన్నిసర్గల గ్రంథమో నిర్ణయించలేము. (శ్రీధర పవర్ ప్రెస్ప్రతి) అవసర్గ 13-శ్లో. తరువాత, 55 వరకు. 41 శ్లోకములున్నా, 'పతింతి' అనే క్రియాపదం తప్ప 55 పైపాదంకూడాలేదు. ఇంకా 8 వ. సర్గమొదట దాదాపు 30 శ్లో-ను. చివర దాదాపు 10 పత్రాలు (100 శ్లో-పైన) దొరకలేదు. ఇంకా అక్కడక్కడ కొద్ది కొద్దిగా పోయినై.

# పూర్వకవయిత్రి గంగాదేవి

## ● కవిత్వము ●

గంగాదేవి కవిత్వం చాల మృదుమధురంగా వుంటుంది. చక్కని తేలిక పదాలతో భావంస్ఫురింప జేస్తుంది. శైలి మిక్కిలి సరళం. మనోహరమైన భావాలు. ఈ కావ్యం చదివేటప్పుడు కాళిదాసు కవిత్వం జ్ఞప్తికి వస్తూవుంటుంది. అన్నిటిలోను స్త్రీ హృదయం వ్యక్తమవుతూ వుంటుంది. ఈమెకు ఉపమాలంకారం మీద ప్రీతిమెండు. అక్కడక్కడ, ఉత్ప్రేక్ష, శ్లేషగూడ ఉపయోగింపబడుతూ వుంటవి. శ్లోకంచదవగానే అర్థం స్ఫురిస్తూ వుంటుంది. గ్రంథమంతా ద్రాక్షపాకంతో వొప్పి, మిక్కిలి హృద్యంగావుంటుంది. అక్కడక్కడ 'సమస్త సామన్తమస్త కన్యస్తశాసనః' లాంటివీ ఇంకా పెద్ద సమాసాలున్నా మిక్కిలి సరళాలు, పదార్థఃస్ఫోరకాలున్ను, వర్ణనారీతిగూడ చాల చక్కగావుంది. ఉపమకు——

'తస్యాసీ ద్విజయనామ.........శక్రస్యేవామరావతీ' 'యశ్శేష ఇవనాగానాం, నగానాం హిమవానివ, దైత్యారి రివదేవానాం' మొదలగు వానియందు ఉపమాలంకారము చక్కగా వున్నది.

మఱియు 'అన్తర్బింబిత చంపేంద్రా_కంపేంద్ర స్యాసిపుత్రికా అప్సరోభ్యః పతిందాతు మన్తర్వత్నీ కిలాభవత్' (4-8-1) (లోపల ప్రతిబింబితుడైన చంపేంద్రుడుగల కంపన్నపతియొక్క కృపాణ పుత్రిక అచ్చరలకు భర్తనిచ్చుట కోయన, గర్భవతియై నట్లుండెను.) నక్షత్రాలను వర్ణిస్తూ——

'అవపత్కాల కాలకర్ష కస్తిమిరాంభః కలుసేనభస్తలే. విమలాముడు బీజమండలీం నవచంద్రాతపసస్య సిద్ధయే' (7-2-9) (నూత్న చంద్రికయనే సస్యసిద్ధికై చీకటియనే నీటితోగూడిన ఆకాశమందు కాలమనే కర్షకుడు, నక్షత్రాలనే విత్తనాలనునాటి నట్లుండెను.) ఇటువంటి శ్లోకాలు మిక్కిలి చమత్కార జనకములుగా వున్నవి. గర్భము, గర్భదోహదాలు చక్కగా చమత్కారంగా వర్ణింపబడినై. సోమరాజి గర్భస్థమైన శిశువును రక్షించాడానికి వచ్చిన కాలోరగిగా వర్ణింపబడింది.

## ● అనుకరణము ●

గంగాదేవికి కాళిదాసన్న మక్కిలి అభిమానము, పూజ్యభావమూను. అతడు కవులలో కెల్ల ఉత్కృష్టుడని, శ్రేష్ఠుడనీ, కవిరాజనీ ఆమెతలపు. అందువల్లనే 'దాసతాం కాళిదాసస్యకవయః కేనబిభ్రతి ఇదానీ మపితస్యార్థా నుపజీవంత్య మీయతః' (1.7) అని తక్కిన కవులకు కాళిదాసుని దాసత్వమును నిరూపించినది. అంతేగాక కాళిదాసుని ఆదర్శంగాబెట్టుకొని అతని అడుగుజాడల్లో తనపాదచంక్రమణాలను సాగించింది. శాబ్దికముగాను, ఆర్థికంగాను, అన్నివిధాలా ఆతనిపోకడలనే అలవరుచుకొన్నది. వర్ణనాపద్ధతిలోను, శైలిలోను ఆతనిచిహ్నాలే కన్పట్టును. కాళిదాసు ననుకరించే తావు లనేకములున్నవి.

'తేజోవిధాతుః ప్రథమేవసృష్టిః' (2,1) ఇది 'యాసృష్టిః స్రష్టురాద్యా' (శా) అనియు 'యాతత్రసాద్యావతి విషయేసృష్టి రాద్యేవధాతుః' (మే. సం) అను కాళిదాసు శ్లోకములకు ఛాయయే.

'ఆకంపయిష్యత్య యమేకవీరః సంగ్రామరంగే సకలానరాతీన్. ఇత్యేవనిశ్చిత్య సదీర్ఘదర్శీ నామ్నా సుతంకంపన ఇత్యకార్షీత్' (2-3-4) అనే శ్లోకమందు 'బ్రాహ్మే ముహూర్తే కిలతస్య దేవీ కుమార కల్పంసుషువే కుమారం అతః పితా బ్రహ్మణ పవనామ్నాత మాత్మజన్మాన మజంచకార' (ర. వం) అనే కాళిదాసుయొక్క పోకడలే ప్రతిబింబించినవి.

'ఆచారలాజైం పౌరాణాం పురంధ్ర్యస్తమ వాకిరన్' (4.3.3) అనేది, 'అవాకిరన్ వయో వృద్ధాస్తంలాజైః పౌరయోషితః' (ర. వం.) అనేదాన్ని, 'కలమగోపవధూభిరగీయత' అనే 'శాలి గోప్యోజగుర్యశః' (ర. వం.) అనే కాళిదాసు సూక్తులను పూర్తిగా అనుకరిస్తున్నవి. ఇలాంటి వింకావున్నై. ఇంకా దీనిలోని శ్లోకాలు కొన్ని 'రాఘవేంద్ర విజయము' లోని వానిని పోలివున్నవి. 'పృథివ్యాంపద్య నిర్మాణవిద్యాయాః ప్రథమంపదం' (మ. వి. 1.5) 'సగద్యపద్య నిర్మాణవిద్యాయాః ప్రథమంపదమ్' (రా. వి. 1.1.0) వీనికిని, 'వాణీ పాణి పరామృష్ట వీణానిక్వాణహారిణీం' (మ. వి. 1 8) 'వాణీ పాణి తలాసక్త వీణారవ విడంబినీ' (రా. వి. 1. 6) వీటికిని.పరస్పరం చాలా సామ్యంవుంది.

'గుణంవిహాయ కావ్యేషు దుష్టోదోషంగ వేషతే. వనేషుత్యక్తమాకందః కాకో నింబమపేక్షతే' (మ. వి. 1. 2. 0) 'కావ్యేగవేషతే కశ్చిత్ దోషమే వగుణంపరః, పిచుమందంయథా కాకః పికశ్చూతల తాంయథా' (రా. వి.) వీటిరెంటికినీ సామ్యం స్ఫుటంగానే తెలుస్తూంది. ఇలాంటి చోట్ల కొన్ని అను కరణాలున్నా కావ్యంబాగానే వుంది.

## ● మహాకావ్యత్వము ●

'నగరార్ణవశైలర్తు చంద్రార్కోదయ వర్ణనమ్ ........పతానియత్ర వర్ణ్యంతే తన్మహాకావ్య ముచ్యతే, ఏషామష్టా దశానాంద్యోః కైశ్చిదూనమ పీష్యతే' (ప్ర. రు) అనే లాక్షణికోక్త (మహాకావ్యత్వ) లక్షణాన్ననుసరించి గంగాదేవి తనగ్రంథాన్ని మహాకావ్యముగా నిరూపించుకొన్నది.

(ప్రథమసర్గ) పురవర్ణన, (ద్వి. స) కుమారోదయ వర్ణనము (పం స.) ఋతువర్ణనము రతోత్సవ వర్ణనము, (స. స.) చంద్రోదయ వర్ణనము, (చ. స.) దిగ్విజయము, గ్రంథాంతమున ఆజినాయకా భ్యుదయము, మొదలైన వర్ణనలు చక్కగా వర్ణింపబడ్డాయి.

గంగాదేవియింకా యితరగ్రంథాలేవీ రచించలేదో, రచించినా ప్రకటింపబడలేదో గాని యితరా లేవీ కనబడవు. ఈ మహాకావ్యం హృద్యంగానూ, సరళంగానూవుండి రచయిత్రికి కీర్తిదాయకమై ఒప్పు చున్నది.

## ఆంధ్రసోదరి!

మెలఁతలకు నెల్ల నామెయే మిగులు సుగుణసంపదలనంచు లోకమే సతినిగొండు
సలుపునోయట్టి సీతను దలఁచుచుండు మాంధ్రసోదరి! శుభముల నందఁగలవు

ఆమెశీలము వర్ణింప నలవిగాని వారు కవులని యేపతివ్రతను గుఱిఁచి
విజ్ఞులందురో? యట్టి సావిత్రి నీవు మఱువఁజనదాంధ్రసోదరి! మానసమున

భారతీయ మానినులకు వన్నెప్రోది సేయునట్టి చంద్రమతిని జెలిమిఁబలికి
నీదుదేశమునకు ఖ్యాతి నిలిపితేని యాంధ్రసోదరి! శ్రేయములందఁగలవు.

ఊవిదలకు నెల్ల దమయంతి యొజ్జబంతి యంచు చెలిమిరికత్తెల యండఁజేరి
నీవు నొక్కి వక్కాణింపు నిఖిలశుభము లందఁగల వాంధ్రసోదరి! అడ్డులేక

మాని కన్యకలకునైన జ్ఞానబోధ సలుపగలయట్టి తెలివియే సతికిగలదొ
అట్టిద్రోవది గుఱిఁచి ప్రోయాంధ్ర తోడఁ బలుకు మాంధ్రసోదరి! నేరుపలవడంగ.

—శ్రీ అగూరు సింహాచలపట్నాయకులు.

# ఆకలిమంటలు

శ్రీమతి గోపరాజు సీతాదేవి

'తల్లీ! గుప్పెడు మెతుకులు. మూణ్ణాళ్లనుంచి కూడులేదు. నిలవలేక పోతున్నాను. కడుపుమంట. నీకు పున్నెముంటుంది తల్లీ! నాలుగ్రోజుల పసిగుడ్డు. నెత్తురుముద్ద. పాల్లేవు. మీరు తినగా పారేసిన ఒక్క కబళం. ధర్మాత్ముఁరాలివి, కనికరించు అమ్మా!'

టపీమని తలుపులు మూసుకుపోయాయి. నాలుగ్రోజుల కటికబాలెంత - చిరిగిపోయి, మాసిపోయి శరీరాన్ని సగం సగం కప్పుతూండే గుడ్డపేలికలతో, నడి శీతాకాలం రాత్రి తొమ్మిదిగంటలవేళ ఎముకల్ని కొరికే ఆచలిలో వీధిఅరుగుక్రింద అడ్డమయిన కుళ్లూ కొట్టుకుపోతుండే సైడుకాల్వపక్కన ఆ అనాధమాత చలికిలబడిపోయింది—

* * *

కోలాహలంగా వుంది భోజనాల పందిరి. విరవని అప్పడాలకోసం కూర్చున్నారు పెళ్లివారు.

* * *

ఎంగిళ్లు పారబోసే కుండీనిండా కుప్పలుకుప్పలుగా ఎంగిలాకులున్నాయి. కొన్ని కిందపడి పొర్లాడుతున్నాయి. రెండు కుక్కలు గట్టిగా దెబ్బలాడుకుంటూ పంచుకుంటున్నాయి క్రిందపడ్డవాటిని.

కుప్పలుగాఉన్న ఆ విస్తళ్లుచూచేసరికి ఆకలితోటి కళవళపడుతూన్న ఆమె మొహం సంతోషంతోటి, సంతృప్తితోటి ఇంత అయింది. భరించ శక్యంగాని వాసనలతోటి, మట్టి కొట్టుకుపోయిన కొంగుపరచి, బిడ్డను ఒకచేత్తో పట్టుకుని, రెండోచేత్తో ఒక ఆకు శుభ్రపరిచింది. ఒక్కొక్కవిస్తరి దొర్లించి అన్నం, పప్పుకూరలు, సగంసగం కొరికిన పిండివంటలు ఎంతో ఉత్సాహంతోటి పోగులుపెట్టుకో నారంభించింది. తనపిల్లలకి ఈవేళ కడుపునిండా కూడు - తనకి కడుపు నిండేపోయింది ఊహించుకోటంతోటి. అయ్యో, దిక్కుమాలిన కుక్కలు శనిగ్రహాల్లా మాటిమాటికి జోరబడి విసిగించాయి ఆమెని. ఇంక తాళలేకపోయింది. గబగబా, దొంతర్లుగా మూటకట్టి వెనక్కి తిరగకుండా చరచర నడిచిపోయింది—

ఆకలిమంటల విలయగర్జనలుచేస్తూ తీవ్ర అసహనంతోటి ఆ అమ్మమీద మొరుగుతూనే ఉన్నాయి కుక్కలు చాలసేపు. కడుపుచిచ్చు తీర్చుకోటానికి, ఆఖరికి క్షుద్రజంతువులతోటి, పోటీపడుతోంది మనుష్యజాతి ఈరోజున మానాభిమానాలు, నీతినియమాలు వమ్ముచేసి. అహో! దేవుని సంతానం!!

ఆకలిమంటలు! రక్తారుణితనేత్రాల్తో ఈ పీడిత దీనప్రపంచం నాగరిక సభ్యతా ప్రపంచాన్ని, నేటి సమాజ వ్యవస్థని ప్రశ్నిస్తోంది - సమాధానం ఏమిటి???

# ★ శారదాచట్టము — యువకుల బాధ్యత

అనుకూల దాంపత్యాలు, దేశకళ్యాణం, సంఘోన్నతి, స్త్రీ అభ్యుదయము, హిందూదేశ పాతివ్రత్యమహాత్మ్యము, భారత మహిళాశీలము, అనాదిసిద్ధముగా యున్నటులే యింకను నిలబడాలంటే, యువకులే పూనుకోవాలి.

శ్రీమతి ఆచంట సత్యవతమ్మ

'శారదాబిల్లు' ఎందుకు చట్టంచేశారు? కన్యల భావిసౌఖ్యంకోసమున్ను, బాలికలు అనుకూల దాంపత్యంకలిగి గృహమునుభూతలస్వర్గంలాచేసికొని సుఖించుటకొఱకున్ను, అజ్ఞానవయస్సులో పెండ్లిచేసినచో వివాహోద్దేశము, దానిపవిత్రత, పతియన్న యెట్లుగా భావించి మెలగవలెనో తెలియక, కేవలం బొమ్మల పెళ్ళిళ్ళుచేసి బాలికలు వినోదించులాగున, వేడుక వినోదాలనే అనుభవనీయంగా గాక, పద్నాలుగేళ్ల ప్రౌఢకన్యలైనచో దాంపత్య ధర్మమెరిగి వివాహముయొక్క సర్వానుభవమునెరిగి పొందవచ్చుననియే యుద్దేశించి చట్టంచేశారు.

కాని ఫలితం మరొకవిధంగా పరిణమించింది. ఏలాగంటే, బాలికలైనా ప్రౌఢకన్యలైనా, ప్రస్తుత పాశ్చాత్యస్వేచ్ఛా విహారవిద్యావతి తక్క, తతిమ్మాకన్యలందరూ ముప్పాతికమంది తలిదండ్రుల జాగ్రత్తలో పెంచబడుచున్న వారలలో స్వేచ్ఛావర్తనులుకారు. అన్నివిషయాలా మాతాపితల అధీనంలోనే ఉన్నారు. వారిగతి యిప్పుడెట్లున్నదనగా 'ఈనకాచి నక్కలపాలైనట్లుంది'. అమ్మాయినో పండులా పదహారేళ్లు పెంచారు. విద్యాబుద్ధులు, సంగీత సాహిత్యాలు, పనిపాటలు, నేర్పించారు. నిరుద్యోగం, డిప్రషన్ ఏకమై కుటుంబాలుచితికాయి. పిల్లలు పెళ్ళిళ్ళకేదిగారు విద్యాయువకులు వరవిక్రయులయారు. ఆశకంతంలేదు. కన్యాసౌందర్య సుగుణాలు అవసరంలేదు. దేశపరిస్థితుల గమనింపేలేదు. మ్రింగడానికి మెతుకులేకపోయినా మీసాలకు సంపెంగనూనెలు కావాలి. కడుపుకు గంజిలేకపోయినా, కాఫీ, టీలు కావాలి. కడుపుకన్నం లేకపోయినా కట్టుకునేటందుకు సూట్లు బూట్లును, కళ్ళవేడుకలకు నాటకసినీమాలు కావాలికాని, కన్యాజనకుల కడగళ్లాలోచించేజ్ఞానంకల వరులు కనపడడంలేదు. వేలమీదవెడుతున్నారు.

దీనికితోడు, బాలింతమరణాలు, యువతీచావులు హెచ్చయ్యాయి. యువకులకన్న కౌమార వృద్ధవరులు వృద్ధియైనారు. అంతవరకు అనుకూలంగా సంసారంచేసి, బిడ్డపాపలతల్లియై మరణించిన సహధర్మచారిణి కొఱకు, సానుభూతి యిసుమంతలేక, పదమూడోదినం నాటికే, పట్టంచుకండువాలతో, పచ్చబట్టలతో పసుపుకాళ్లతో, పెళ్లికొడుకవడానికి సిగ్గులేక, చింతలేక, సిద్ధపడుచున్నాడు. కన్యకోసం, కట్నమిస్తానంటున్నాడు. పడుచుభార్యకోసం పలవరించి, మధ్యవర్తులచేత, మంగళసూత్రధారణ చేస్తానని మాటలుజరిపించి, కన్యయొక్క బీదతలిదండ్రులకు భ్రాంతికల్గించి, కనులుకప్పించి, కల్లభాగ్యములు చూపించి కన్యలను కళ్యాణ సౌందర్యమూర్తులను, లలితముగ్ధా సుందరమణులను ఆరముగ్గిన పండ్లను, నవనవలాడు పసిడిబొమ్మల నమాం

1940. ఆగష్టు

తంగా ప్రేమప్రణయ యువతీయువక స్నేహానుబంధముల విడదీసి, తమఆధీనం చేసుకొనుచున్నారు! పిల్లలబ్రతుకెంత కడగండ్లపాలు! అట్టి తల్లిదండ్రులెంత కఠినులు! కన్యలనే కాంక్షించు వృద్ధభాగ్యవతుల ఆశాప్రవర్తనలెంత విచారణీయం! ఇవి సంఘానికి క్షీణదశచేకూర్చి, అననుకూలదాంపత్య విలాపాలుకల్పించి, సవతితల్లుల పీడ బిడ్డలకు దాపురింపజేసి, సంఘవృక్షానికి వేరుపురుగులై, జీవచ్ఛవముగాజేసి, ప్రేమయనే బీజము నంతరింపజేయుచున్నారు. వితంతువుల మళ్లీ పెళ్లికి వరులు వేరు. తాముకన్యలనే కాంక్షించుటచేతను, యువకులు కట్నాల దేవతలగుటచేతను యువకులకు యువతులు తేరు. తుదకీనకాచి నక్కల పాలైయాచీలాగ బాలికలు. ఇట్టి వివాహాలనేకం జరుగుచున్నాయి.

ఇట్టి దేశారిష్టాలరికట్టాలంటే, విద్యాయువకులు నడుంబిగించి, కట్నాల వెర్రులు తల్లితండ్రులకు వదల్చాలి; నచ్చచెప్పాలి. తామువిమర్శించుకొని, వృద్ధ పెళ్లికొడుకుల వెర్రి వ్యామోహాలు వదల్చాలి. బాలికల సుగుణసౌందర్యాలే చూడాలి కాని, డబ్బుమోహం వీడాలి. అప్పుడు కాని ఈ పీడలు వదలవు.

బాలికామణుల నమాంతంగ మ్రింగకాచుకొన్న వృద్ధ పెళ్లికొడుకులకు బుద్ధిచెప్పాలి. నలుబది సంవత్సరములు దాటినవారు భార్యావియోగానంతరం తిరిగి పెళ్లిచేసికొనుటొక గొప్పతప్పు. అందుపై యీడు జోడు విడదీసి, కన్యలనే పరిగ్రహించుటొక గొప్పఘోరము. కాన, శారదాయాక్టుయొక్క యుద్దేశం నిలబడులాగునను భారతరమణీపవిత్రత తొలగజేయు విడాకులచట్ట మవసరములేకుండునటుల చట్టము ప్యాసుజేసిననేకాని స్త్రీసౌఖ్యము, దేశసౌభాగ్యము నిలబడదు.

## —•• పద్మినీ! ••—

ఉ. తామరవంటి పుష్పమును ధారుణిఁగానమటంచు మానవుల్
నీమముతోడ గొల్తు్రనిను నిత్యము; భానుని భార్యవౌట నీ
మోమును గాంచినంతనె త్రిమూర్తులదర్శన భాగ్యమబ్బు నో
భామరో! నేఁడు నీదగుస్వభావము వర్ణనఁ జేయఁజెల్లునే?

చం. మనుజులు నిన్నుగూరిచి యమానుషరీతి వచింత్రుగాని, నీ
వననొక దివ్యమూర్తివని యాత్మగణింపదేమొ పద్మినీ!
అనునయశీతలామృత విహారమొనర్చెదు భృంగమేక్రియన్
గనుగొనుచుండు నిన్నటులఁగాంచగ నేరకయుంట నిచ్చలున్!

చం. "పరపురుషుండితండు గురుపత్నిహరించె వివేకశూన్యుఁడై
కరుణయొకింతలేక; మనకాంతుని ముందితఁడెంత?" యంచునీ
వరయుదివేమొ చంద్రుఁగనినంతనె, గర్వమిదేల నీకు? నీ
సరసునిఁగూడ కల్వలు శశాంకుని ప్రాపున చిన్నజూడవే!

మ. తొలికోడిన్ వినినంత నీహృదయమెంతో సంతసంబందు, తొం
గిలి చూడన్ జెలికత్తెలంగలసి సంఘీభావమేపారనీ
నిలయంబందున మోము నెత్తెదవుగానీ, వెంటనే రాడు; ఈ
యిలపై నింతటి మోహమున్న ప్రియుపై నెట్లోగదే పద్మినీ!

—శ్రీమతి జయంతి కామేశ్వరీదేవి.

# నిత్యావసరములలో ఒకటి




మీ భర్త పనినుండి, మీ పిల్లలు బడినుండి, యింటికి రాగానే వారికి టీ తయారుచేసి యిచ్చుట మీ విధి. కాబట్టి ప్రతి రోజు మీ యింట్లో టీ పార్టీ అన్నమాట—సంసారఆనందమునకు ముఖ్య మిదియే. మీ యింటిలో వలెనే అనేక యిండ్లలోకూడా అదే విధముగా యిదే సమయమున యీలాటి సంతోషకర విషయమే జరుగుచున్నదని నమ్ముడు!

## మనము ఇండియా టీ నేత్రాగుదము



తేనీరు తయారుచేయు విధం—మంచినీటిని మరుగ కాచవలయును. పరిశుభ్రమైన పాత్రను కొద్దిగా వెచ్చజేయుడు. మనిషికొక చెమిచా చొప్పున, ఎంతమందికి తేనీరు కావలయునో అన్నిచెమిచాల తేయాకుతో, మరొక చెమిచా తేయాకు ఎక్కువగా చేర్చి ఆ పాత్రలో వేయుడు. కాగుతున్న నీరు సలసల మరుగగానే ఆ నీటిని ఆ తేయాకు పాత్రలో పోయుడు. అయిదు నిమిషములు అట్లుండనిచ్చి, ఆ తేనీరును కప్పులలోపోసి పాలను పంచదారను కలిపి సేవించుడు.

# వింత వింతల ప్రపంచం

ఫ్లోరిడాలో మైమిఅనే పట్టణంలో ఎమొరికాల్లన్ అనే వడ్రంగి వున్నాడు. అతనిభార్య గర్భిణితో వుంది. 6-వ మాసంలో ఆమెగర్భము బరువుగావుండడంవల్ల హాస్పిటలుకుపోయి డాక్టరును సలహా కోరింది. అతడు ఎక్సరే (X - Ray) ఫోటోతీసి 'ఇప్పటికి కడుపులో 5 గురు పిల్లలున్నారు. ఇంకాకొన్ని ఈ ఐదుకంటె చిన్నతలకాయలు కనపడుతున్నాయి. ఒకటిరెండు మాసములు గడిచితేనేగాని ఎంతమంది వుండేది చెప్పలేను' అన్నాడు. ఈ విచిత్ర గర్భానికి పరమానందపడుతూ వున్న ఆమె ఆరోగ్యం విషయంలో ఏవిధమైన బాధలుకలుగకుండా స్థానికప్రభుత్వం తగు శ్రద్ధచూపుతూ ఆమెకు సపర్యలు చేస్తున్నారు. ఈమె సుఖంగా ప్రసవమైనట్లయితే, వైద్యశాస్త్ర సహాయింతో జరిగినది ఇది 31 వది అవుతుందట, ఒక్క అమెరికా దేశంలోనే.

♦ ♦ ♦

న్యూజెర్సీ దేశంలో ఒకగ్రుడ్డిమనిషి వున్నాడు. అతడు తన చేతులతో తడుముకుంటూ పుస్తకాలు చదువుతాడు. ఇది అందరికి ఆశ్చర్యాన్ని కలగజేసింది. అలాచదవడంలో అతనికి భగవంతుడు ప్రసాదించిన ప్రత్యేకశక్తి ఎలాంటిదో కనిపెట్టగలిగితే గ్రుడ్డివాళ్లకందరికి విద్యనేర్పడంలో ఇదిఒక క్రొత్త పద్ధతిగా వుపయోగించవచ్చునని కొంతమంది శాస్త్రజ్ఞులు ఇప్పటికి 5 సంవత్సరములుగా ప్రయత్నిస్తున్నారు. ఇంతలో ఆగ్రుడ్డివాడు కారుక్రిందపడి తన రెండుచేతులు పోగొట్టుకున్నాడు. ఇప్పుడు రెండుచేతులు మొండివి. అయితేనేం, కాలిబొటన వ్రేళ్లతో అక్షరాలనుతాకి, చదువుతున్నాడు. దీన్నిచూచి ఆ శాస్త్రజ్ఞులకు ఏమీ అర్థమవక ముక్కుమీద వ్రేలేసుకున్నారుట.

♦ ♦ ♦

ఆఫ్రికా, ఆడ్డాపట్టణంలో నేషనల్ పార్కులోని ఏనుగులు పారిపోతూవున్నాయి. వాటిని ఆపడంకోసమని ఒక ఫెన్సు కట్టారు. ఆఫెన్సును సునాయాసంగా లాగేసి ఏనుగులు వెళ్లిపోయాయి. అప్పుడు ఫెన్సునుతిరిగి పాతి ఆతీగలో విద్యుచ్ఛక్తిని ప్రసారంచేసారు. కొద్ది రోజులుపోయిన తర్వాత, తీగలుకట్టిన స్తంభాల్లో విద్యుశ్ఛక్తి లేకపోవడంచూచి, ఆ స్థంభాలతో వాటిని ఊడపెరికి ఏనుగులు పారిపోయాయి. తిరిగి స్థంభాల్లోను, తీగల్లోనూ కూడా విద్యుశ్ఛక్తిని ప్రసారంచేశారు. అప్పుడు ఈ ఫెన్సు ఒక 10 మైళ్లవరకే వుండడంచూచి అంతవరకు ఏమిఎరగని వాటివలె నడిచివెళ్లి అక్కడనుంచి పరుగెత్తుకుపోయాయి. ఇంకాదొరకలేదు, ఆ పారిపోయిన ఏనుగులు.

♦ ♦ ♦

కెఖ్వాన్ పట్టణంలో 60 ఏళ్లు వయస్సుకలిగిన ఒక పల్లెవాడున్నాడు. అతనికి 58 ఏళ్లవయస్సు కలిగిన భార్యవుంది. వీరిద్దరికి 25 ఏండ్లక్రితం వివాహమైంది. ప్రతిసంవత్సరం ఒకొక్క కాన్పు చొప్పున ఇప్పటికి వారికి 24 గురు సంతానం. వారిలో 14 గురు మొగవాళ్లు, 10 మంది ఆడవాళ్లూను. 1940 డిశంబరులో వారిద్దరికి వివాహమై 25 ఏళ్లు పూర్తి అవుతాయి. ఇప్పుడు ఆమెకు గర్భిణి.

# అద్దం   'గోపాలకృష్ణ'

సాతూప్వరా పర్వతప్రాంతాల్లోవున్న అడవులలో కోయవాళ్లు చాలామందివున్నారు. అచ్చట కొమ్మూరు అనే కోయపల్లె వున్నది. ఆపల్లె చుట్టుప్రక్కల యెక్కడ చూచినా పర్వతాలే. అచ్చటి యువతులకు తామెంత అందముగానున్నారో చూచుకొనుటకు అద్దాలులేవు. అందుచేత తమ ముఖాలు యెలాగు వుంటాయో తెలిసికోవాలంటే, తమ ప్రియులు వానినిగురించి చేసే వర్ణనలమీదనే ఆధారపడియుండవలసి వుంటుంది. వారి వర్ణనలు సాధారణంగా అద్దంకన్న పదిరెట్లు యెక్కువగానే వుంటాయి.

కొమ్మూరులో 'మక్కీడు' అనే యువకుడు ఉండేవాడు. వాడు ఆ అడవుల్లో తిరుగుతూవుండగా చిన్న అద్దం కనిపించింది.

మక్కీడు గుండ్రంగావున్న అపూర్వ వస్తువును పైకితీసి చాలా కుతూహలంగా పరీక్షించాడు. అలాంటి వస్తువు తన జన్మలో యిదివరకెప్పుడునూ చూడలేదు. కాని దాన్ని చూస్తుండగానే, అతనికి దానియందొక విధమైన భయము, గౌరవము, ఆశ్చర్యము కలిగాయి. మాణిక్యంలాగు మెరుస్తూవున్న ఆ వస్తువులో వానికి తనతండ్రి ఆకారము కనుపించింది. "మాతండ్రి! మానాన్న ముఖమే!" అని సంతోషాతిశయంతో అనుకొన్నాడు.

మక్కీడు మెత్తనిఆకులు కోసుకొనివచ్చి చాలా జాగ్రత్తతో అద్దాన్ని వాటిలో చుట్టబెట్టాడు. గౌరవాతిశయంతో దాన్ని దాచుకొన్నాడు. ఇంటికి వెళ్లిన వెంటనే దానిని యెక్కడపెట్టి దాచవలెనో దీర్ఘంగా ఆలోచించి, చివరకు చూరులో దాచడానికి నిశ్చయించినాడు. ఈ సంగతి యెవ్వరితోను అతడు చెప్పదలచుకోలేదు. తన ప్రేయసియగు తిమ్మికికూడ ఆ సంగతి చెప్పదలచుకోలేదు. ఎందుకంటే స్త్రీలకు నోట్లో నూగింజయైనా ఆగదని అతని దృఢనమ్మకం. తిమ్మితో చెప్పితే త్రిలోకాలు తెలిసిపోతుందేమో అని అతని భయం.

కాని మక్కీడు మాత్రం తన తండ్రిముఖం కనిపించుచున్నదన్న అద్దాన్ని విడిచి చాలాసేపు ఉండలేక పోయేవాడు. తనపని మానేసి ప్రతిరోజూ మధ్యమధ్య యింటికివచ్చి తలుపువేసికొని తన కండ్లార మనస్సుతృప్తిగా ఆబొమ్మకేసి చూచుకొనేవాడు.

కోయ స్త్రీలకుకూడ మనలోవలెనే ఏదైనా క్రొత్తవస్తువుగాని, విషయంగాని కనిపించినప్పుడు దాని పుట్టుపూర్వోత్తరాలన్నీ తెలిసికొంటేగాని తృప్తి కలుగదు. మక్కీడు తాను పరిపరిసార్లు యింటికి రావడం తనను చూచి ఆనందించడానికే అని యెంతచెప్పినా తిమ్మికి బాగా నమ్మకం కల్గలేదు. మొట్ట మొదట ఆతని ప్రణయసూక్తులు విని కాబోలనుకొన్నది. కాని అతడు వచ్చినపుడెల్ల ఆతని ముఖంలో ఒక వింతకళ, ఆశ్చర్యము, భయము మొదలగు భావాలు కనిపిస్తూ వచ్చాయి.

అప్పటినించీ తిమ్మి ఈ సంగతేమిటో కనుక్కోవాలని నిశ్చయించుకొని మక్కీడుచేసే కార్యాలన్నీ జాగ్రత్తగా చూడ్డం మొదలెట్టింది. త్వరలోనే ఆవిడ మక్కీడు ప్రతిరోజూ ఒంటరిగా పెరటిలోనికి

వెళ్లి ఏదోచూచి వస్తూండడం గమనించింది. ఆ విషయాన్ని పరిశోధించాలనుకొంది. కాని యెప్పుడు వెదకినా యేమీ కనుపించేదికాదు. చిట్టచివరకు ఆమె ప్రయత్నం సఫలమైంది.

ఒకనాడు మక్కీడు పెరటిలో ఉండగానే తిమ్మి హఠాత్తుగా వెళ్లింది. అప్పుడే మక్కీడు చూరులో ఏదో సర్దుతూవున్నాడు. అప్పటి మట్టుకు తిమ్మి యేమీ మాట్లాడలేదు; కాని అతడు వెళ్లిపోయిన తత్క్షణమే తిమ్మి పెరటిలోనికి పరుగెత్తింది. తిన్నగావెళ్లి చూరులో వెదకడం మొదలెట్టింది. ఆకుల్లో చుట్టపెట్టి వున్న అద్దాన్ని పైకి తీసింది. ఆశ్చర్యంగా దానిలోనికి చూచింది. అదీ! తెలిసింది, దానిలో చూడగానే, మక్కీడు దాచివుంచిన రహస్యం!

తిమ్మి తాను చూచినది తానే నమ్మలేకపోయింది. స్త్రీ ముఖమొకటి తనముందర ఆ వస్తువులో గానవచ్చింది. ఇదా మక్కీనికి తనపైనున్న ప్రేమకు తార్కాణము?

తిమ్మి మనస్సులో పరిపరి విధాలుగా ఆలోచించింది. ఆమె దీనత్వము, చింత, వర్ణించడానికి గదా, మక్కీడు మాటిమాటికి ఆ పెరటిలోనికి పోయేవాడు! గుట్టు బయటబడింది యెలాగైతేనేం!

ఆమె విచారం హఠాత్తుగా కోపంగా మారిపోయింది. అదేమైనా అందంగావుందా? ఆముఖం చూస్తే పూరకోతిలాగవుంది. అసహ్యాం, డోకు పుట్టిస్తూంది ఆముఖం. అటువంటి స్త్రీని మక్కీడు ఎట్లు ప్రేమించగలిగాడు?

తిమ్మికి జీవితంలోని సౌఖ్యం ఒక్క దెబ్బతో తుడిచివేసినట్లు తోచింది. చేతులోని అద్దం అప్రయత్నంగా పట్టువదలి ఒడిలో పడిపోయింది. పెరటిలో తిమ్మి క్రింద నేలమీద పడి దొర్లుతూ ఏడుస్తూవుంది. మక్కీడు ఇంటికివచ్చి 'తిమ్మీ' అని పిలిచాడు. పలకలేదు. 'ప్రేయసీ' అన్నాడు.

'నేనుకాదు ప్రేయసిని. మిమ్మల్నే దైవంగా నమ్మియున్న నన్ను మీరు యిలాగ చెయ్యడం మీకు న్యాయమేనా?' అంది తిమ్మి కంట నీరుపెట్టుకొంటూ.

'నాకేమీ అర్థం కావడంలేదు. ఏమిటీగోల?' అన్నాడు మక్కీడు ఆశ్చర్యంతో.

'అవును. మీ కర్థంకాదు. ఎందుకర్థం అవుతుంది? స్త్రీ చిత్రాలు ఇంటిలో దాచుకోవడం అర్థం అవుతుందికాని యింకేమీ అర్థంకాదు, పాపం. ఇదిగో మీ ప్రేయసి బొమ్మ. తీసికెళ్లండి.' అని యేడవడం ప్రారంభించింది తిమ్మి.

'తిమ్మీ, నీకేమి పిచ్చియెత్తిందా? ఇది మా నాన్నగారి బొమ్మ. ఆయన చనిపోయి యిప్పటికి పదేండ్లయినా, యిందులో ఆయన ముఖము బ్రతికి వున్నట్టు సరిగా కనిపిస్తూవుంది. నాకిది ఒక రోజున అడవిలో దొరికింది. అప్పటినుంచి, నేను దీనిని చూరులో పెట్టి దాచుకున్నాను.' అని మక్కీడు స్పష్టపరిచాడు.

అంత అబద్ధం మరొకటి వుండదనిపించింది తిమ్మికి. చేసిన తప్పుకితోడు అబద్ధంకూడా చెప్తున్నాడని తిమ్మికి కోపం ఉబికి వచ్చింది.

మక్కీడు ఓర్వలేక పోయాడు. ఏదోషమూ యెరుగని తన్ను నిందించుచున్నందులకు అతనికి చాలా విచారమూ, రోషమూ కలిగింది. దాంతో, నాలుగు చీవాట్లూ పెట్టాడు తిమ్మిని. అంతకంతకు పెద్ద గల్లంతుగా తేలింది. అప్పుడు ముసలి పురోహితుడొకడు ఆ త్రోవను పోతూ, వీధి తలుపు తీసి వుండడంవలన, యింటిలో యేదో గల్లంతుగావుంది చూచిపోదామని లోపలకు వచ్చాడు.

'ఏమిటీ గడబిడ? యీ దెబ్బలాట యేమిటి?' అని తిమ్మిని, మక్కీడునీ అడిగాడు పురోహితుడు.

'అయ్యా! నాభార్యకు పిచ్చి యెత్తినట్లుంది. ఈమె నామీద వట్టి నీలాపనిందలు వేస్తోంది.' అని తిమ్మికేసి చూచాడు.

'బాబుగారు, నేనన్నదానిలో యేమీ అబద్ధంలేదండి. ఇదిగో చూడండి, యీాయన యెవరిదో ఆడుదాని చిత్రమును దాచికొని మాటి మాటికి చూచుకుంటూ వుంటారు.' అంది తిమ్మి.

'నేను ప్రమాణంచేసి చెప్తున్నాను. నాదగ్గర వున్నబొమ్మ మా నాన్నగారిదిగాని యింకెవరిది కాదు.' అన్నాడు మక్కీడు దృఢంగా.

'సరే, ఎందుకీ వాదం? ఏదీ, ఆ బొమ్మయేదో యిలా యివ్వండి, నేను చూస్తాను.' అని పురోహితుడు మధ్యవర్తిత్వం చేయబోయాడు.

అద్దాన్ని పురోహితుడి చేతులోపెట్టారు దంపతులు.

పురోహితుడు అద్దానికేసి తేరిపారి చూచాడు. అది చూడ్డంతోనే ఆతనికి ఆశ్చర్యం, గౌరవమూ, భయమూ, ఒక్కసారి కలిగాయి. అందులో కనుపడ్డ బొమ్మకి సగౌరవంగా నమస్కారంపెట్టాడు. ఆ నమస్కారాన్ని అబొమ్మ ప్రతి నమస్కారంతో అందుకొంది. తిమ్మినీ మక్కీడునీ చూచి పురోహితుడీలాగన్నాడు. 'దీనివిషయమై మీకేమీ వాదం అవసరంలేదు. ఇంక శాంతించండి యిద్దరూకూడా. మక్కీడూ, యిది నీ తండ్రి బొమ్మాకాదు, స్త్రీ ముఖమూకాదు, ఇది యెవరో ఒక మహానుభావుడగు పురోహితుని బొమ్మ. ఇది నేను తీసుకొనివెళ్లి నాపూజా మందిరములో దాచుతాను.'

పురోహితుడప్పుడు వాళ్ల నిద్దరనూ ఆశీర్వదించి, యింత గడబిడకూ మూలకారణమైన అద్దాన్ని పట్టుకు వెళ్లిపోయాడు.

## అభ్యుదయము

చిరుకరి వెలుగుల
దినపతి బింబం
తూరుపు దెసనే
పొడిచింది.

వెలివెలి చీకటి
చిటుక లోననే
ప్రొద్దు వెలుగులో
కరిగింది.

మానిని కోరే
మానవలోకం
నీతి హీనతలో
సమసింది.

మహిళల వలచే
మాన్యప్రపంచం
మహామహి తినే
లేచింది.

ప్రకృతి భాగ్యం
ప్రణయ ప్రభావం
తెలుసుకు
తెలిపే
భావౌన్నత్యత
ప్రబలింది.

పైపై రంగుల
వర్ణన చేసే
ప్రాత జబ్బులీ
క్రొత్త సొబగులో
అణిగేయి.

నవ కవులారా!
యువ నటులారా!
నవ్య మహోదయ
పాంచ జన్యమున
సుస్వర శ్రుతిలో
భావగీతికలు పాడండి
ప్రణయ నాటికలు ఆడండి.

భావ గీతికల
హృద్యారావములు
ప్రణయ నాటికల
లాస్య భాగములు
పాంచ జన్యపూ
పంచమ స్వరమూ
విశ్వం నిండాలె.

దెసలను దాగొను
వేలుపు పెద్దలు
ఎదుటికి రావాలె.

—శ్రీమతి జయంతి లక్ష్మీమంగతాయ్.



తూర్పుఖండంలో జపాను తిరిగి యుద్ధపుచిచ్చు ముట్టించింది. జపాను బాంబులకు గురియై ఇల్లు మొదలైనవి సర్వనాశనముకాగా, కన్నబిడ్డతో నిలువ నీడలేక అల్లాడుతూవున్న నిర్భాగ్య చీనా మాత.



బొంబాయిలోని చికిత్సక సమూహ విద్యాలయంవారు బొంబాయి యువతులకు, యుద్ధంలో దెబ్బలు తిన్నవారికి వైద్యసహాయం చెయ్యడంలో తరిఫీదియ్యడమే కాకుండా, మిలటరీ శిక్షణకూడా ఇస్తున్నారు.




# కళలు - వాటిఉత్పత్తి - వికాసము

శ్రీమతి కె. సుగుణమణి

### ★ కళోత్పత్తి

విశ్వమానవ వికాసములో మానవుఁడు దిగంబరత్వమును వీడి, పశుప్రాయత్వమును దాటి, పర్ణములను, ప్రకృతివస్తువులను తన శరీరాలంకారమునకు జీవితసౌకర్యమునకు వినియోగింప నారంభించిననాడే 'కళలు' సాకారమును దాల్చినవన్నమాట. అనాగరికుఁడగు అడవిమనిషి చెకుముకిరాళ్లు, విల్లమ్ములు, పనికరములు, ఆహారవిహారములు, క్రమముగ మోటుతనమును వీడి నాజూకులైనవి. అతని భావప్రకటీకరణకు అంగసైగలు, కరసంజ్ఞలు నశించి శబ్దోచ్చారణ యేర్పడినది; అనంతరము అక్షరసృష్టి ఆరంభమై వాఙ్మయము జనించినది; తన్మూలమున నాగరికత ఆరంభమైనది. ఈ భాషోత్పత్తి, లిపిజ్ఞానములవలన మానవుని మానసిక వికాసమునకు అపూర్వమైన దోహదమేర్పడినది. ఇక మానవుఁ డార్జించిన జ్ఞానము లిఖితరూపమున భద్రపరచబడి తరతరములుగా వ్యాపించు మార్గమేర్పడినది. మానవుని ప్రజ్ఞ ప్రబలి, ప్రాణికోటిలో నతని ప్రాధాన్యము, ప్రభుత్వము స్థాపింపబడినది. అదివరకు ఆహారసౌకరణకే తిరుగాడు మానవునకు అవకాశ సావకాశములు లభించినవి; మానసవికాసమునకు తగిన ప్రాపుగలిగినది. తన జ్ఞానేంద్రియ కర్మేంద్రియములకు మనస్సును (బుద్ధిని) జోడిచ్చి, మానవుఁడిఁక పంచభూతాత్మకమైన ప్రపంచమునేగాక, పిపీలకాది బ్రహ్మపర్యంతరముగల ప్రకృతిని, ప్రకృతిధర్మములను, పరిశోధింప దొరకొనెను. విశ్వవిహారము సల్పగల మనస్సుచే విశ్వమును గాలించి, విశ్వనిర్మాతను, తన్నునుగూర్చి చింతింపజొచ్చెను. ప్రకృతిని వీలైనంతవరకు తన సౌకర్యమునకు వినియోగింప యత్నించి, ప్రకృతివస్తువులను, శక్తులను, తనకు ఆనంద ఆహ్లాదములు గూర్చువానిగా జేసికొనవలెనని కృషిసల్పెను. ఈ కృషి, యత్నములయొక్క ఫలితమే మన మిప్పుడు గాంచుచున్న 'విద్యలు', 'కళలు', 'శాస్త్రపరిశోధనలు', 'నాగరికత' మున్నగునవన్నియును.

### ★ కళావికాసము

ఈ కళావికాసక్రమమునకును మానవుని శరీర, మానసిక, ఆధ్యాత్మిక వికాసక్రమమునకును సన్నిహితసంబంధమున్నది. ఆదిని శరీరపోషణ, సౌకర్యములకై వలయు వస్తువులగూర్చియే మానవుఁడు చింతించి necessity is the mother of invention అన్న చందమున వానిని వుత్పత్తి చేసికొనదొడఁగెను. కాని మానవునకున్నది ఒక్క శరీరమేగాక మనస్సు, ఆత్మయుగూడను. పశు పక్షి మృగాదులవలె నితఁడు ఆహార, నిద్ర, సుఖవాంఛలతో సంతుష్టిపడి యూరకుండలేకుండెను. భౌతికశరీరపోషణ అభివృద్ధులకు, ఆహారమెట్లావశ్యకమో అట్లే మనస్సునకును (వేరొకవిధమైన) ఆహారమావశ్యకమైనది. వివిధవిద్యలు,

పరిశ్రమలు, కళలు, ఊహలు, ఉద్యమములు, ప్రేమభావము, దైవచింతన మున్నగునవి యీ మానసికాహారములు. మానవుని ఆత్మ అందలమున కెగిరి చిందులుద్రొక్కు నైజగుణముగలిగి, విశ్వవిహారమొనర్చి, విశ్వమును తనలో నిముడ్చుకొనజూచు స్వభావముగలది. ఆత్మకు ఆధ్యాత్మిక చింతన, ప్రేమభావము, దైవభక్తి అత్యంతావశ్యకములు. అందులకే 'నిరాహారినై దినములు బ్రతుకగలను గాని దైవప్రార్థనలేక క్షణకాలము మనజాల'నని గాంధీమహాత్ముఁ డొకచో వాక్రుచ్చెను. "Man does not live by bread alone" అన్న జీసస్ పల్కులకివి వన్నెదెచ్చుచున్నవి.

## ★ వ్యవసాయిక కళలు

ఆదిని మానవుఁడు తన శరీరపోషణ, సౌకర్యములకై సృష్టించుకొనిన కళలే వేట, వ్యవసాయము, పశుపాల్యము, నేత, మృత్కర్మము, దారు, లోహకర్మములు మున్నగునవి. మానవుఁడు నాగరికుడైన కొలది, వేట తగ్గి 'వ్యవసాయము' ప్రాధాన్యతలోనికి వచ్చి, నాటికిని నేటికిని ముఖ్య కృషియు, మాతృకృషియునైనది. పూర్వము ఆర్యులు గోగణములను సాకుచు, సస్యములను పైరుజేసికొనుచు, ధాన్య, కందమూల, వన్యఫలములతో జీవించుచు, జీవితకాలమును జ్ఞానార్జనకై వినియోగించుచుండెడివారు. తమ సస్యములు, పశుగణములు సర్వజీవరాసులు చక్కగ సాకబడందులకై సూర్య, ఇంద్ర, వరుణాది దైవములకు వీరలు గావించు ప్రార్థనలు ఋగ్వేదమున గానవచ్చును. ఆధునికకాలమున "Oh, God, give us our daily bread" అని ముక్తిని విడచి భుక్తికొరకై ప్రభువును వేడు ప్రార్థనలును, జ్ఞానార్జనను మరచి ధనార్జననే ప్రధానముగ బెట్టుకొని సాగించు 'కళలు'ను, పాశ్చాత్య నాగరిక సోదర సోదరీమణులకడనే గాక ప్రాచ్య అనాగరిక సోదర సోదరీమణులకడను, విద్యావిహీనులగు దీనులకడను, విద్యాధికులగు మన నిరుద్యోగులకడను గూడ గాంచగలము!

## ★ ఆత్మానందమే ప్రధానముగాగల కళలు

వ్యవసాయిక కళలను సృష్టించినవెనుక మానవుఁడు క్రమముగ మానసికానందమే ప్రధానముగాగల కళలగు ఇతిహాస, ఆగమ, కావ్యాలంకార నాటకరచనలు, చిత్రలేఖనము, గానము, కవిత్వము మున్నగు కళలనన్నిటిని సమకూర్చెను. వీటితో చతుష్షష్టికళలు పూర్తియైనవి. వీటి నామములు 1939 జూలై 'గృహలక్ష్మి'లో నీయబడినవి. 'కళ' యనఁ మానవునిలో అపూర్వభావములను కలిగించునది. హృదయములను భావోద్రిక్తము లొనర్చుటయే కళకు స్వభావము. ఆంగ్లకవి షేక్స్పియర్ గూడ ఒక సందర్భమున నిట్లే వచించెను. అతనికి "Tongues in trees, books in running brooks, sermons in stones, and good in everything" గోచరించునట! ఈ వాక్కుల యథార్థము కవులకు, కళారాధకులకు పూర్తిగా నెరుకయే. చిన్న ఉదాహరణగూడ గైకొందము. కళామయ ప్రకృతియొక్క సందర్శనమువలన కళారాధకునకు భావపరంపర లుదయించి, అవర్ణనీయమగు అనుభూతి (feeling) గా మారి, అపూర్వమగు ఆత్మానందము నొనగూర్చును. ఈ ఆనందము నితరులకును కలిగించవలెననెడి ఆతురత మానవ సహజమైయున్నది; గనుకనే ఆదిమహాకవులు మొదలు ఆధునిక భావకవులవరకు కవిత్వములు వ్రాసిరి; చిత్రకారులు చిత్తరువులు వ్రాసిరి, శిల్పులు రాళ్లకు జీవముపోసిరి; తదితర కళోపాసకులు కళావస్తువులను సృష్టించిరి. మనోహరమగు సూర్యోదయదృశ్యమును ఒక (i) కవి, (ii) చిత్రకారుడు, (iii) పాశ్చాత్య photographer కూడ గాంచినారనుకొందము. మువ్వురకును భావోద్రేకము, అనుభూతి, ఆనందము, ఆ ఆనందమును యితరులకును కలిగించవలెననెడి ఆతురత జనించును. (iii) Photographer టిక్కున camera ను నొక్కి

ఆ దృశ్యము పట్టి మన కట్టెదుర బెట్టును. అందు జడప్రకృతియే మనకు గోచరించినను దానివలన మనకును కొంత ముద మొనగూడును. కాని యిందు ప్రకృతియే తనపనిని తాను గావించినది. ఫోటో తీసినది వెలుగు **(light)** యొక్క సహజగుణముగాని కేవలము **photographer** యొక్క ఘనత, మానసికవృత్తి గాదు. ఒక పెద్ద 'కళ'గా భావింపబడవలసిన ఘనత యిందు అంతగనుండదు. ఇట్లే యంత్రమే ప్రధానముగాగల తదితర పెక్కు పాశ్చాత్య 'కళలు' గూడను. **(ii)** చిత్రకారుండన్ననో ఆ అనుభూతిని జీర్ణముజేసికొని, ఆ దృశ్యమును తొలుత తన హృదయఫలకమున జిత్రించుకొని, అటనుండి దానిని రంగులతో పత్రముపైకి దెచ్చి, మనకా ప్రకృతిసౌందర్యమును చవిజూపును. ఇందు సహజవర్ణములతో విరాజిల్లు చిత్రమునేగాక చిత్రకారుని సామర్థ్యమును, కృషిని, నైపుణ్యమును, కళకళలాడు ప్రకృతిశోభను గాంతుము. **(i)** కవి మనస్సునందును ప్రకృతిసందర్శనమువలన నిశితైక్ష్యముతో భావానుభూతి జనించును. **Photographer** కు కానరాని సౌందర్యమెంతయో అతనికి గాన్పించును; ప్రకృతి అతనితో సంభాషించును. ప్రకృతిరమణీయకము తోబాటు అనేక అపూర్వవిషయముల నాతడు గ్రహించి, వానికి జీవముపోసి ఒక పద్య, లేక గద్యరూపమున నా దృశ్యమును, అంతియేగాక దానివలన తాను పొందిన భావానుభూతినిగూడ మనకు ప్రసాదించును. ప్రకృతి అతని మానస అద్దమునుండి ప్రతిబింబించి వాక్కు లేక శబ్దరూపముదాల్చి, మనకు గోచరించును. 'తలుక్కుటద్దములు సత్కవుల మనసు' అని అందులకే అనియుండిరి.

★ కళ దేనికొరకు?

కళలన్నియు 'ఆత్మానందమే' ముఖ్యాశయముగాగలవి. కొందరు కళలు ప్రచారమున కనవచ్చును. కొందరు కళోపాసకులు యశఃకాములు కావచ్చును. ఒక గాయకుని గాని, చిత్రలేఖకుని గాని, కవినిగాని నీకీపాట, చిత్రము, కవితల్లుట వలన నేమిలాభమని కొందరడుగవచ్చును. ధనార్జనమే జీవితాశయముగ దోచు నీ దినములలో నిట్టివారును కలరు. దీనికి జవాబు **They are their own reward;** వాటికవియే బహుమతి అని. ఆయా కళారాధకులకు తమ కృషివలన గలిగిన ఆత్మానందమును రూకలలో గణకట్టజూచుట మూర్ఖత్వము. ఆ యాత్మానందమే వారలపేక్షించునది; అపేక్షింపవలసినదియును. కాని విశేషముగ కవులు, కళారాధకులును ఏ ప్రభువునో ఆశ్రయించి మాన్యములు గైకొని తమ కళానైపుణ్యములను విత్తమునకు విక్రయించినవారలే యైరి. కళారాధకులకు చిరకాలముగ నీ దోష మాపాదింపబడినది. ఆదిమహాకవులు మొదలు ఆధునిక కళారాధకులందరు యీ మార్గమునే అనుసరించి 'నిరాశ్రయాఃనశోభంతే పండితా వనితా లతా' యని బల్కుజొచ్చిరి. ఈ మార్గమును త్రికరణశుద్ధిగా నిరసించి కేవలము కవిత్వ కళారాధనకే బూనుకొని 'జననంబున్ సఫలంబుఁ జేసెదఁ బునర్జన్మంబు లేకుండగన్' అని సంకల్పించిన మహనీయుఁ డింతవరకు ఒక్కడే గలడు. ముముక్షువుల గణములో ధృవుని నామమై నక్షత్రము శాశ్వతముగా వెలసినట్లు యీ మహనీయుని నామాక్షరములు, వాక్కులు సువర్ణాక్షరములలో కళారాధకుల ప్రపంచమున ఆచంద్ర తారార్కముగ నుండునట్లు అతనివలననే లిఖింపబడినవి. చూడుఁడు—

'ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని చొక్కి శరీరమువాసి కాలుచే
సమ్మెటవ్రేటులంబడక సమ్మతితో హరికిచ్చి చెప్పె నీ
బమ్మెర పోతరాజొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్.'

'బాలరసాలసాల నవపల్లవ కోమల కావ్యకన్య కం
గూళలకిచ్చి యప్పడుపుఁగూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైననేమి గహనాంతర సీమలఁ గందమూలగా
ద్దాలికులైననేమి నిజదార సుతోదర పోషణార్థమై.'

ఈ మహోత్కృష్ట వాక్యములు వచించుటయేగాక, వానిని అక్షరముల ఆచరణలోబెట్టి జూపిన ఈ కళోపాసకుడు కళోపాసకులందరికి తలమానికమై, ఆదర్శుడై, వందనీయుడై, పూజ్యుడై యలరారవలసినదే! ఇందు 'సత్కవుల్' అన్న పదమునకు బదులు 'కళారాధకులు' అన్న అర్థమునిచ్చు పదము బెట్టుకొన్నచో నీ పల్కులు సర్వజనులకు (కళోపాసకులకు) అన్వయించగలదు. కళయొక్క ఉన్నతాశయము ఆత్మకు ఆనందము చేకూర్చుట, మానసికాభివృద్ధికి తోడ్పటుట యని నిస్సంశయముగ జెప్పవచ్చును. దాని వలన ఆర్థికలాభము చేకూరినను నిజమగు కళోపాసకుడు స్వీకరింపడని పోతన జీవితము చాటుచున్నది.

ఈమాదిరి అపూర్వ 'ఐహికవస్తు నిరసన', 'కళోపాసన' 'కవితారాధన' 'దైవభక్తి' పోతన వంటి మహదాశయములుగల మహనీయునకే చెల్లినవి. ఆ మనోనిశ్చయము, స్వతంత్ర జీవనాభిలాష, కళాపిపాస, ఆధ్యాత్మ చింతన, అత్యంత ప్రశంసనీయములు. 'అడిగిన నొఖరినీయని- మిడిమేలపు దొరను వేడి, మిణుగు' ప్రజాసందోహములకు, 'వడిగల యెద్దులగట్టుక మడిదున్నుక బ్రతుకవచ్చు మహిలో' నన్న వేమనార్యుని పల్కులును, 'హాలికులైననేమి నిజదార సుతోదర పోషణార్థమై' యన్న పోతనామాత్యుని పల్కులును యెంతయు మార్గదర్శకములు. కాని ఆధునికులు 'ఏడువగలిగినచో వ్యవసాయము చేయు' మని బల్క ప్రవీణులు. ఏడువవలసినదే గాని, ఏడ్చుట వ్యవసాయము చేయనేరక కాదు; 'రత్నగర్భము', 'విద్యాపీఠము', 'కల్పవల్లి' అనిపించుకొనిన దేశములో పరిస్థితులు, ప్రజలు, విద్యలు, ప్రజల మానసిక ప్రవృత్తులు యీరీతిగ పరివర్తన నందినందులకు. మాతృకృషియగు వ్యవసాయమువలన నీ రోజులలో జీవనోపాధి గడుపకపోవుటకు హేతువులు 'నాగరికత' యనిన ప్రజలకుండు అభిప్రాయము ఒకటియు, పాశ్చాత్య ప్రభువుల ప్రభుత్వము వేరొకటియును.

## పిచ్చుకల గూఁడు

కాలవశమున మా పర్ణశాలలోన పిచుకలొకరెండు గూటిని పెట్టియుండి
చల్లగా, ప్రక్క మందార చెట్టులోన పాటుపడి కట్టుకొన్న యాగూఁటిలోన
జీవయాత్రను గడపుచు. జెలఁగుచుండ వరప్రమాధిని వైశాఖ బహుళమందు
విష్ణుదిన భానువాసర విమలనిశిని మ్రానుపిల్లి యొక్కటి దీక్షఁబూని కండ్లు
కానజాలని పిచ్చుక స్త్రీనిబట్టి చంపితినిపోయె జముదూత చందమునను
చివుకుమనె మది, గూఁడును చిన్నవోయె వగలఁ బొగలుచు మగపుల్గు దిగులు నొంది
దానితోఁడను గూఁటిని తాను విడచి అచ్చటచ్చట కూర్చుని యడలుచుండె
ఒక్కవారము దనుక నా వరుసనుండి యెటులఁ బోయెనో యాజాడ నెరుఁగరాదు
అంతలో వానిసంసార మంతరించె పక్షులందును క్రిములందు పశువులందు
జంగమస్థావరాత్మక జగతికెల్ల భువన మందిర దీప విస్ఫురిత కాంతి
కాంతగాకున్న నన్యంబుగలదె తలప; కళలు వెదజల్లు సృష్టికి కారణంబు.

—శ్రీమతి కొరప్రోలు వెంకటరంగమ్మ.



# "ఈ మాత్రము శ్రద్ధవహించిన మీ ముఖమునకు కోమలత్వము నిక్కముగా చేకూరును"

మీ ముఖ సౌందర్యమునకు మృదుత్వము, శుభ్రత చాలా అవసరము. ఇట్టి సౌందర్యమును ప్రతి స్త్రీయును పొందగలదు. ముఖ కాంతిని నిర్లక్ష్యము చేయవద్దు. నిత్యము సామాన్యపు శ్రద్ధవహించిన మీ ముఖమునకు ఇదివరకెన్నడు కానబడని కోమలము, కాంతి, అందమును ఇచ్చును.

నిత్యము ఉదయమును, రాత్రియును కొంచెము "పాండ్స్ కోల్డ్ క్రీము"ను ముఖమునకు మర్దనచేయుడు. దానిలోనుండు శుభ్రపరచు తైలము మీ చర్మరంధ్రములలో జొరపడి పేరుకొనిన మురికినంతను నిర్మూలనముచేసి చర్మమును శుభ్రపరచును. మెత్తని గుడ్డతోగాని, లేక "పాండ్స్ ఫేస్ టిష్యూ"లతో గాని తుడిచివేయుడు. అదేమాదిరి రెండవతూరి చేయుము. రాత్రివేళ మరికొంచెము ఈ క్రీమును ముఖమునకు పూసి ఉదయమువరకు అట్లే ఉంచుము.

పగటివేళ ఎండ తాపము, వేడి గాలినుండి రక్షించుకొనుటకై "పాండ్స్ వ్యానిషింగ్ క్రీము" నుపయోగించుడు. అది జిగటలేనిది; మరియు పౌడరు వేయగానే అతుకుకొని పోవును.

మీ ముఖకాంతిని కాపాడుటకు తక్షణమే "పాండ్స్ క్రీము"ల నుపయోగింపుడు. రెండు వారముల తరువాత మీ చర్మము కోమలముగాను, కాంతియుతముగాను, అతి మృదువుగా నుండుట చూచి మీరే ఆనందించగలరు.



పాండ్స్ కోల్డ్ క్రీమ్: చర్మమును చాలా నిర్మలముగను మృదువుగ నుంచును. రాత్రియందు, ఉదయమందు దీన్ని ఉపయోగింపుడు.



పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్: ఎండ తాపము, వేడి గాలినుండి మీ చర్మమును జాగ్రతపరచును.

# పాండ్స్ క్రీమ్

## ముఖ సౌందర్యమునకు పాండ్స్ క్రీములు

# పరివర్తనము

★ శ్రీ భాస్కర్ల కృష్ణారావు ★

'రాధా! నా ఫౌంటెన్‌కలం ఎవరు పాడుచేశారు యిల్లా?'

'.................'

'రాధా!'

'ఆఁ! వొస్తున్నా'

భర్త తీవ్రమైన అరుపులకి కారణం తెలియక కొంచెం కళవళపాటుతో నారాయణరావుగారి గదిలో ప్రవేశించింది రాధ. భార్య గది గుమ్మంలోకి రాగానే వొళ్లుతెలియని వీరావేశంలో మళ్లీ అదే వరసని అందుకున్నాడు నారాయణరావు.

'నీకోసం ఎన్నిసార్లని అరవాలి?'

'పెరట్లో కప్పులు కడుగుతున్నానండీ—పనితొందరలో మీ పిలుపు వినపడలేదు.'

'నీకు మరీ పరాకు ఎక్కువఅయింది. పిలుస్తుంటే మనిషిని కాననుకున్నావా? ఈ కలం ఎవరు పాడుచేశారు యిల్లా?'

'ఏమోనండీ, నాకేం తెలియదు, ఉదయంమాత్రం పిల్లలు ఈ గదిలో ఆడుకుంటూవుండగా చూచాను.'

'ఉదయం పిల్లలు ఎక్కడ ఆడుకున్నది నిన్నడగటంలేదు. ఈ కలం ఎవరు పాడుచేశారని నిన్నడగటం'

'పిల్లలు ఏమైనా తీశారేమో కనుక్కున్నారా?'

పైవాక్యం వెలువడిందే తడవుగా నారాయణరావు గదంతా 'సుసీ', 'సుసీ' అన్న కేకలతో నిండిపోయింది.

సుసి మరుక్షణమే నాన్నగారి కోపానికి కారణం తెలియక వేలమొహంతో గదిలో ప్రవేశించింది.

'నా గదిలో అల్లరిచెయ్యొద్దని మీకు ఎన్నిసార్లు చెప్పాను?'

నాన్నగారి పై ప్రశ్నకి సుసి కళ్లల్లో అమాంతంగా నీళ్లుతిరిగాయి. జవాబు చెప్పటానికి నోటిమాట పెకల్లేదు. ఎండిపోయిన చిరుపెదిమెల్ని నాలిక చివరతో తడుపుతూ, నిశ్చేష్టురాలై జవాబుగా కళ్లు నులుపుకోవటం మొదలెట్టింది సుసి.

'ఈ కలం నువ్వు తీశావా?'

లేదన్నట్లు తలూపింది...

'తమ్ముడేమైనా తీశాడా?'

జవాబులేదు...

'జవాబు చెప్పవేఁ?'

సుసి ఈమారుకూడా జవాబు చెప్పలేకపోయింది...

సుసి మౌనానికి నారాయణరావు ఉగ్రుడైపోయినాడు. కళ్లెర్రజేసి, ఒళ్లుతెలియకుండా ఆ అమ్మాయిని సమీపించి ఆ గదిలో వోహామూలకి వున్న చేతిబెత్తాన్ని అందుకొని బాదటం మొదలెట్టాడు. సుసి కిక్కురుమనకుండా, పొంగి పొర్లుతూ వొస్తూవున్న దుఃఖాన్ని దిగమ్రింగి 'కలం నేను తీయలేదు - నాన్నా కలం నేను తీయలేదు' అన్న అమాయకపు అరుపులతో ఆ అత్యాచారాన్ని సహించింది.

‘తమ్ముడేడీ?’

రెండునిమిషాల తరువాత అడుగుతో అడుగు వేసుకుంటూ, ముకుళించిన మొహంతో మూడేళ్ళ కూన ‘మురళి’ నగ్నంగా గదిలోకి ప్రవేశించాడు.

‘ఈ కలం నీవు తీసావా?’

అవునన్నట్లు తలూపాడు. పసిపిల్లలకి అబద్ధాలాడటం తెలియదు. వాళ్లకి అజీర్ణవొస్తువలకి మళ్లే అసత్యంకూడా వొంటబట్టదు. నారాయణరావు తన కోపం ఆసాంతం ఇంతకుముందే సుసిపైన తీర్చుకున్నాడు. పడకకుర్చీలో పడుకున్న పాటుని ఆ కలాన్నే పుచ్చుకుని విసిరికొట్టాడు మురళి మొహంమీద.

మురళి సుసికి మల్లే దుఃఖాన్ని దిగమ్రింగటం తెలియక బోరుమని ఏడుస్తూ గదిలోంచి వెళ్ళిపోయినాడు.

* * *

నారాయణరావు ప్రథమ కళత్రం ఈ లోకాన్ని విడిచి షుమారు మూడుసంవత్సరాలయింది. కమలను నారాయణరావు ఆమె బ్రతికివుండగా అమితంగా ప్రేమించాడు. ఆ రోజుల్లో ‘ఆమెతోడిదే ఈ లోకమన్నట్లు’ నడుచుకోవటంవల్ల నారాయణరావు భార్యావిధేయుడనికూడా ప్రజల్లో ప్రతీతి అయింది.

మొదటిభార్య ఈ లోకాన్ని విడిచిందే తడవుగా నారాయణరావుకు సంబంధాలు రావటం మొదలెట్టాయి. కమల ప్రేమని అంత తొందరలో మరిచి, మళ్లీ వివాహానికి సిద్ధపడటమంటే ఆతనికి మొదట్లో మనస్కరించలేదు. పిన్నవయసులో వున్న నారాయణరావు, తనకోసం కాకపోయినా, పసిపిల్లలకోసమైనా మళ్లీ వివాహం చేసుకోవటం శ్రేయస్కరమని బంధువులంతా సలహాయిచ్చారు. నారాయణరావుకు కొంత వరకు వాళ్ల సలహా న్యాయసమ్మతంగానే గోచరించింది. వొంటరిగా పిల్లలతో కాపురంచేయటమంటే కష్టసాధ్యంగానే కనపడింది.

ఈ విషయాలన్నీ నారాయణరావు మనస్సుని బాగా కలతపెట్టాయి. పిల్లల బాగోగుల్నిబట్టి వివాహం చేసుకోవటమే అతనికి అప్పట్లో విద్యుక్తంగా కనపడింది. తత్ఫలితంగా చివరకి రాధని పరిణయమాడాడు.

* * *

ఆరోజు రాత్రి నారాయణరావు గదిలోకి పడుకోవటానికి వెళ్లేసరికి పిల్లలు యింకా నిద్రపోకుండా పక్కలమీద కూర్చునే వున్నారు. అంత రాత్రిదాకా పడుకోనందుకు కొంచెం విసిగి, పడుకొమ్మని పిల్లల్ని మందలించి, తనపక్క సమీపించాడు నారాయణరావు. వెళ్లి పక్కమీద మేనువాల్చిందే తడవుగా అతనికి సుఖంగా నిద్రపట్టింది.

రాత్రి పన్నెండింటికి గావును నారాయణరావుకు మళ్లీ మెళుకువ వొచ్చింది. నిద్రమాంద్యవల్ల ఎంతరాత్రి అయిందో అతనికి తెలియలేదు. కిటికీలోంచి బయటికిచూస్తే అర్ధచంద్రుడు వాయువేగంగా మబ్బులోంచి పరుగెత్తుతూవున్నట్టు అతనికి కనపడింది. నెమ్మదిగా కదిలి, తనమీదవున్న రాధ చేతుల్ని పక్కకు వత్తిగించి, ఎడమపక్కని మళ్లేసరికి పిల్లలు కిక్కురుమనకుండా పక్కలమీద కూర్చునివున్నట్టు పొడ కట్టిందాతనికి. రెండునిమిషాలు ఆలోచనారహితంగా వాళ్లవేపు నిదానించి చూచాడు నారాయణరావు.

సుసి తమ్ముడిముందు కూర్చుని మురళికంటికి ఆవిరిపెడుతోవుంది. మొదట్లో మురళి కంట్లో నలుసు యేదో పడివుంటుందనుకున్నాడు నారాయణరావు. కాని వొకనిమిషం తదేకదీక్షగా ఆ కంటివేపు చూచేసరికి కన్ను అమితంగా పొంగినట్లు కనపడిందాతనికి.

'మురళీ! ఏమయిందమ్మా కంటికి?'

నారాయణరావు ధ్వని వినపడగానే సుసి కొంచెంగా వులికిపడి ఏమీతెలియనట్లు పడుకోవటానికి ప్రయత్నించింది. కాని అంతలోకే నారాయణరావు పిల్లల్ని సమీపించి 'భయంలేదులే తల్లీ! లేచి కూర్చో' అని లాలించటంతో సుసి కొంచెం ధైర్యంతెచ్చుకుని మళ్లీ లేచి కూర్చుంది.

నాన్నగారి లాలనకి మురళి అమాంతంగా కళ్లవెంబడి నీళ్లుపెట్టుకున్నాడు. నారాయణరావు దిగులుగా మురళిని వొళ్లోకి తీసుకుని ధోవతి కుచ్చెళ్లతో కన్నీళ్లు తుడిచాడు. మురళి దుఃఖం నాన్నగారి బుజ్జగింపులకి అంతకంతకు మరీ ఎక్కువయింది.

'నాన్నా! ఏమయిందే నీకంటికి?'

మురళికి తన బాధనిగూర్చి తండ్రికి చెప్పుకోవటంకూడా చాతకాలేదు. మురళికి యితరులని అర్థం చేసుకోగల శక్తిమాత్రం కలిగింది గాని తన మనోగతభావాల్ని యితరులకుమాత్రం స్పష్టంగా వ్యక్తపరిచే జ్ఞానం యింకా కలగలేదు. ఆ మాటలురాని పసికూనకి కంటికేదో నెప్పి అయింది అని చెప్పటంకూడా దుర్భరమయింది.

మురళి అవస్థ నారాయణరావుకి సునాయాసంగా వ్యక్తమయింది. మళ్లీ మురళిని ప్రశ్నించటంవల్ల లాభంలేదని తెలుసుకుని 'సుసీ! ఏమయిందమ్మా తమ్ముడి కంటికి' అని ప్రక్కనున్న అమ్మాయిని రెట్టించి అడిగాడు. సుసి మొదట్లో నిజంచెప్పటానికి జంకింది. కాని నారాయణరావు 'భయంలేదులే' అని హామీ యిచ్చేసరికి ఆ లేతహృదయానికి యెక్కడలేని ధైర్యం కలిగింది.

'నాన్నా! పొద్దున్నే, కలంతో నీవు కొట్టలే...'

నారాయణరావుకు అంతా అర్థమయింది. ప్రొద్దుటి దృశ్యం సినిమాకి మల్లే వొక్కమాటు కళ్లముందు తిరిగింది. ఉదయం పిల్లలపట్ల అంత అమానుషంగా, క్రూరంగా ప్రవర్తించినందుకు లోలోపల తన్నుతానే నిందించుకున్నాడు. పిల్లలు 'అనాధలకు మల్లే' బ్రతకటంచూచి అతని హృదయం తరుక్కుపోయింది.

'కమలమీది అవ్యాజమైన ప్రేమకి యిదా ఫలితం' అన్న వొక్కప్రశ్న ఆతని హృదయాన్ని దహించటం మొదలెట్టింది.

మరుక్షణంలోనే యిద్దరి పిల్లల్ని చెరో చంకని యెత్తుకుని తనపక్కని తిన్నగా చేరుకున్నాడు నారాయణరావు. మళ్లీ అదే ప్రశ్న. హృదయంలో చెప్పరాని బాధ అంకురించింది. ఆ బాధ నివారణానికి అప్పట్లో ఏమిచేయటమో అతనికేమీ తోచలేదు. ఎంతో ఆలోచించాడు. ఏమీ పాలుపోలేదు. చివరకి వొక్కటే వొక్క మార్గం కనపడింది. అప్పట్లో అతనికి అదే యుక్తంగా తోచింది.

అప్రయత్నంగా పిల్లల్ని హృదయానికి గట్టిగా అదుముకున్నాడు. కొంత మనోశాంతి కలిగింది కాని హృదయానికి సంపూర్ణమైన సంతృప్తికాలా. ఆ పసిపిల్లల్ని అంతకంతకు తన హృదయంలో యిముడ్చుకోవటానికి ప్రయత్నంచేశాడు, కాని సాధ్యంకాలా. విఫలమనోరథుడై ఏదో అర్థిస్తున్నవాడికి మల్లే కమలవేపు రెండునిమిషాలవరకు ఏకాగ్రంగా చూచాడు. ఫోటోలోంచి కమల చిరునవ్వు నవ్వినట్లు కనపడిందాతనికి. ఆలోచనరహితంగా, సంతృప్త హృదయంతో వెనుదిరిగిచూచేసరికి రాధ ప్రేమపూర్వకంగా చిరునవ్వునవ్వుతూవున్నట్లు పొడకట్టింది. ఆ చూపులకి గొప్ప అపరాధికి మల్లే బాధపడి పిల్లల్ని మరీ దగ్గరికి తీసుకుని నిండుగా శాలువ కప్పుకున్నాడు నారాయణరావు. నిద్ర యెప్పుడు పట్టిందో, ఏమో అతనికే తెలియదు——

# హైందవాచారాలలో విజ్ఞానం

పేడనీళ్లు
ముగ్గులు



● వసంత ●

మానవునికి జ్ఞానోదయమైనప్పటినుండి ప్రకృతిని అర్థంచేసికొనడానికి నిరంతరంగా చేస్తూన్న కృషియొక్క ఫలితమే విజ్ఞానం. మేధావంతుల దృక్పథంబట్టి, పరిశోధనా విధానంబట్టి, వ్యక్తిగతంగాచేసిన సేవబట్టి విజ్ఞానవృక్షం శాఖోపశాఖలుగా పెరిగింది. సంఘాభ్యున్నతికి విజ్ఞానమెంతైనా అవసరం. స్వార్థత్యాగబుద్ధితో 'సర్వేజనాస్సుఖినోభవంతు' అను సదాశయంతో విజ్ఞానులు పారంపర్యంగాచేసిన అమూల్యమగు సేవ మూలంగానే మనం నేడు అత్యంత సుఖజీవనం చేయగలుగుతున్నాం. రైళ్లమీద వేలకొలదిమైళ్లు శీఘ్రంగా పోగలుగుతున్నామంటే; నౌకలతో మహాసముద్రాలు తరిస్తున్నామంటే; పక్షివలె వాయుమార్గాన్న కడు త్వరగా ప్రయాణం చేయగలుగుతున్నామంటే; మనం మాట్లాడేమాటలు, వెలిబుచ్చే భావాలు లిప్తలో ప్రపంచాన్ని చుట్టపెట్టేటట్లు యంత్రాలు నిర్మింపగలిగేమంటే; నిర్జీవపదార్థంలో గుప్తంగానున్న దేవగానాన్ని యంత్రాలచే ఆలపింపచేస్తున్నామంటే; అద్భుత నటనాకౌశలాన్ని పదేపదే తెరమీద ప్రదర్శింపగలుగుతున్నామంటే ఇవన్నీ ఆదినుండి మానవజాతి మళ్లుకట్టి పెంచిన విజ్ఞానవృక్షంయొక్క ఫలాలే. కార్య సాధనానికి, హృదయాహ్లాదానికి, భావోత్తేజానికి మనంచేసే పనులన్నిటిలో విజ్ఞానంఉంది.

విజ్ఞానంలేని జీవితశాఖ నేడు కనుపించదు. గ్రాసం పండించడానికి, వృక్షసంతతి పెంపొందించడానికి, ఆరోగ్యప్రదమైన ఆహారం నిర్ణయించడానికి, మీటనొక్కి దీపం వెలిగించుకోడానికి, ఒకటికాదు, ఉదయంనుండి మరునాడుదయంవరకు మనంచేయు ప్రతిస్వల్ప కార్యానికీ విజ్ఞానమవసరమే !

పాశ్చాత్యవిజ్ఞానం కేవలం భౌతికంగా పెంపొందుతూంది. మన ప్రాచీనవిజ్ఞానం అధ్యాత్మికంగా విస్తరించింది. జీవితసుఖావాప్తికి వారు సృజించిన యంత్రాలతో, ఉపకరణాలతో భౌతిక విజ్ఞానులు జాతి మతభేదం లేకుండా మానవకోటినంతటిని ఆకర్షింపగలుగుచున్నారు. వ్యక్తిపరంగా గాని గుర్తింపబడని అధ్యాత్మజ్ఞానప్రతిభ, కాయక్లేశంతోగాని లభ్యంగానట్టి ఆత్మజ్ఞానాభ్యుదయం ఈ యుగంలో భారతీయులకే వెగటనిపిస్తున్నాయి. సుఖజీవనమే లక్ష్యంగాగల పాశ్చాత్యనాగరికతా వ్యామోహంలోబడి ప్రాచీన విజ్ఞానాన్ని, తుదకు తిరస్కరిస్తున్నాం.

కాని, సర్వజనులు సుఖమయజీవనం చేసికోడానికి వైజ్ఞానికంగా చక్కని దైనందినాచారాలు, మతధర్మాలు, సంఘనియమాలు ప్రాచీను లేర్పాటు చేసేరు. వాటి మూలభావం మనం గుర్తించలేక గుర్తించవలసిన బాధ్యత త్రోసిపుచ్చి, నిర్లక్ష్యంగా వాటి నతిక్రమిస్తున్నాం. అట్టి ఉల్లంఘనవల్ల వాటిల్లవలసిన అనర్థం తక్షణం కనుపించదు. అయినప్పటికీ, ఆ తిరస్కారభావం శారీరకంగా, మానసికంగా, నైతికంగా, ఒకటేమిటి సర్వవిధాలా మనలను క్రుంగతీస్తూంది. మన అధఃపతనం తరతరానికి హెచ్చయిపోతూంది. ఇప్పుడైనా తగిన శ్రద్ధవహించి ఈ అధోగమనాన్ని ప్రతిఘటించి ప్రాచీనౌన్నత్యం పునః ప్రతిష్ఠించాలంటే హైందవాచారాలలో భావం గ్రహించాలి, శ్రేయోదాయకమైన వాటిని అనుకరించాలి, వెఱ్ఱివెఱ్ఱి పోకిళ్లు మానుకోవాలి. వ్యామోహాంధకారం పటాపంచలు కావించుకొని అభ్యుదయ ప్రభాతమయేటట్లు ఏకముఖంగా

కృషిచెయ్యాలి. అప్పుడది జాతీయపునర్నిర్మాణంగా పరిణమిస్తుంది. అందులో సోదరీమణులు ఎక్కువగా పాటుపడవలసి ఉంటుంది. ముఖ్యపాత్రవారిదే అని చెప్పవచ్చునేమో!

ఏమంటే గృహస్థాశ్రమంలో సంసారలాభానికి, కుటుంబక్షేమానికి బాధ్యురాలు గృహిణి. ఆమె కించిద్దూరదృష్టితో, లోకజ్ఞానంతో సంసారం నడిపించిన పక్షమందు జీవనం ఆనందదాయకంగా ఉండడమే కాక, సంతానం సన్మార్గమవలంబిస్తారు. వెల్లివిరియు మాతృవాత్సల్యంతో నిజసంతతికి క్రమశిక్షణ యొసంగిన తల్లి భూలోకదైవమే. ఆమె సంతానం పరోపకారార్థం దేహప్రాణధనాలర్పించు స్వార్థత్యాగపరులౌతారు. అట్టి పౌరుషవంతమైన సంతానాన్నికన్న సతీమతల్లులు కోఅవ్వైనారు. కాబట్టి బాల్యంనుండి పుత్రీపుత్రులకు ఉన్నతభావాలు బోధించి నిరాడంబర జీవనంయొక్క ఉత్కృష్టతను ఎఱుకచేసి, స్వార్థత్యాగంయొక్క మహిమ తెలిపి, వారిని భారతవీరులుగా తయారుచేయు బాధ్యత సోదరీమణులపై నున్నది. అందులకు వారు అర్హులై ఉండాలి. సదాచారాలు వారు పాటించి, పాటింపచేయాలి.

అనాదిగా వాడుకలోనున్న హైందవాచారాలు ఎంత శ్రేయస్కరమైనవైనా వాటి అంతరార్థం గ్రహింపలేకను, పరిచయాధిక్యంతో జనించు విముఖతచేతను వాటిని నిరసిస్తున్నామనేది నిశ్చయం. ఎంత స్వల్పమైన వాటి విజ్ఞానం జాగ్రతగా విమర్శించినా ఆ ఉదాసీనం పోతుందనుటకూడ నిశ్చయమే. ఏమనగా ఎంతో ఎక్కువైన ఆరోగ్యసూత్రాలే ఆచారాలుగా నిత్యవిధులుగా పరిణమించేయి అనవచ్చును. అట్టివి కొన్ని విచారిద్దాం.

ఉదయాన్ని లేవడంతోనే వాకిలిలో పేడ నీళ్లుజల్లి ముగ్గులు పెట్టుకొంటారు. అందులో రెండు విషయాలున్నాయి. ఆరోగ్యం, భూతదయ. రాత్రి వాకిట్లోను, ముంగిల్లోను చేరిన క్రిములను నాశనంచేయ డానికి పేడ అవసరం. ఆ సూక్ష్మక్రిములను ఉదయాన్నే సంహరిస్తే వాటివలన అనారోగ్యం కలుగనేరదు. ప్రతిగృహంలో సులభంగా లభ్యమయేది సూక్ష్మక్రిములను హరించేది పేడ. కాని నాగరికసంఘంలో అది అసహ్యమైపోయింది. పట్టణవాసులు పేడనువాడరు. ఆమూలంగా అనారోగ్యదేవతను ఆహ్వానిస్తున్నారన్న మాట. ఇక ముగ్గుఅనగా అసలు బియ్యప్పిండివాడేవారు. ముగ్గుపెట్టడం కేవలం అందానికేకాదు. అది కాకిపిచుక మొదలైన పక్షులకాహారం. నోరెఱుగని పక్షులు ప్రతి ముంగిలిలోను కొద్దిగా పిండి సంగ్రహించు కొని తృప్తినొందడం ఆ గృహమేధులకు శ్రేయస్కరం. ఈ నవనాగరిక దినాలలో బియ్యప్పిండికి బదులుగా సున్నం ముగ్గువాడుచున్నారు. దానివల్లకలుగు ధనలాభం లేశంగాని, పాపం, అమాయకపు పక్షులనోటిలో మన్నుకొట్టడం జరుగుతూంది. ఆరోగ్యసూత్రం భంగమయింది; భూతదయ అంతరించింది.

అయితే ఏదోకథ చెప్పినట్లు మూఢాచారంగా పరిణమించినట్టివి మాత్రం గుర్తించుకోవాలి. ఒక సోమయాజిగారింట్లో ఒకపిల్లి ఉండేదిట. ఆ పెంపుడుపిల్లి నివేదనకుపెట్టిన పదార్థాలు తినివేయకుండుటకు గాను సోమయాజి నిత్యాహ్నికములు నిర్వర్తించుకొనుటకు ముందుగా దానినొక రాటకు కట్టేవారు. వారి తరువాత తరంవారికి నిత్యాగ్నిహోత్రాలుపోయి దేవతార్చనే మిగిలింది. తండ్రిగారు పిల్లిని కట్టనిదే దేవతా రాధన ప్రారంభించకుండుట చూచిన పుత్రులుకూడ దేవతార్చనకు పూర్వం పిల్లినితెచ్చి రాటకుకట్టేవారు. మరి రెండుతరాలు పోయినవెనుక ఇంట్లో దేవతార్చనకూడ లేకపోయింది. అయినప్పటికి భోజనానికి పూర్వం పిల్లిని కట్టివేయడం తాతముత్తాతలనుండి ఆచారమైనదని, ఆతరంవారు ఊరల్లావెదకి పిల్లినితెచ్చి రాటకు కట్టనిదే భోజనం చేసేవారుకారు. ఇట్లు ఎందుకైతే ఉద్దేశింపబడినదో భగవదర్చన అది అంతరించి నప్పటికి ఆక్రియమాత్రం మూఢంగా నిలిచిపోయింది. అట్టి ప్రమాదం కలుగకుండా శాస్త్ర వివేచనతో ఆచారాలు విమర్శిస్తే వాటి యదార్థం గోచరిస్తుంది. (ఇంకాఉంది)

# తలవని తలంపు

— శ్రీమతి జి. కళ్యాణి —



'అదిగో, రాముడూ! ఆ ముసలమ్మ. దాన్నిచూస్తే నా కడుపు చెరువైపోతుంది.'

రోడ్డు కెడమవైపుగా, మెల్లిగా రిక్షాలాగుతూ 'అవునమ్మా. ఏంచేస్తుంది? పాపం, అలాగే మెల్లిగా ఇంటింటికీ తిరుగుతూవుంటుంది. ముగ్గిపోయిన పండుగదా. పట్టుమని పదికొంపలేనా తిరగలేదు. ఆ తిరిగిన కొంపల్లో దొరికిన గింజలతోటే దానిబ్రతుకు తెల్లారాలి.' అన్నాడు రాముడు తుండుగుడ్డతో చమట తుడుచుకుంటూ. రిక్షా రోడ్డుప్రక్కల చెట్లనీడల్లో మెల్లిగా దొర్లుతూంది. శ్యామల అందులోకూర్చొని ఆ ముసిలిదానికేసే చూస్తూవుంది.

'పాపం, ఆ రోజున నాన్నగారు అడ్డురాకపోతే బుట్టనిండా బియ్యంపోసేదాన్ని. నాన్నగారి మనస్సు కఠినపాషాణం. అదెంత తిట్టుకుంటూపోయిందో! అలాంటివాళ్ల ఉసురుతగిల్తే ఇంకేమయినా ఉందా?'

'అంతా నీలాంటివాళ్లే ఉంటారమ్మా. మీ నాన్నగార్ని ఎంతమంది తిట్టిపోస్తూవుంటారు? రక్తం పిండుకుతాగుతాడనీ, పిసినిగొట్టనీని. అవన్నీ వింటూంటే నాకు చాలా కష్టంగావుంటుంది.'

స్కూలుగంట గణగణ మ్రోగింది. అదివిని రాముడు ఉలికిపడి గబగబా లాగటం మొదలెట్టేడు.

'మెల్లిగాలాగు రాముడూ! దగ్గరకొచ్చేశాంగా' అంది శ్యామల.

♦ ♦ ♦

స్కూలుగంట శబ్దం విని రాముడు రిక్షాలోంచి లేచి దిండు సరిచేసేసరికి శ్యామలవచ్చి కూర్చుంది. యెంతో దిగులుగాఉన్న శ్యామలనిచూచి

'ఏమమ్మా ఆలాగున్నావు మేష్టరేమన్నా అన్నారా?' అన్నాడు రాముడు.

స్కూలుకేసి దీనంగా చూస్తూఉన్న శ్యామల కనుకొలుకుల్లోంచి నీటిబిందువులు జలజలా రాలేయి.

'ఈ బడికీ మనకీ రుణం తీరిపోయింది రాముడు—'

'అదేమమ్మా?'

'సెలవులిచ్చేశారు; రేపణ్ణుంచే ప్రారంభం'

'మళ్లీ తెరుస్తారుగా ఈ వేసంగి వెళ్లగానే?' .

'ఆ, తెరుస్తారు. అందరూ వస్తారు తిరిగి, కాని నాకు ప్రాప్తంలేదు'

'అదేమిటమ్మా?'

'ఈ వేసంగి సెలవల్లో నా వివాహం—ఇక స్కూలుకు రానివ్వరుగా'

శ్యామల నోటివెంట ఆ మాటలు రావడంతోటే రాముడు బిక్కపోయాడు. శ్యామలకేసి అర్థహీనంగా చూట్టం మొదలెట్టేడు. రేపటినుంచి ఆ రిక్షాకీ తనకీ రుణం తీరిపోయిందనుకున్నాడు. అప్పటికి 14 సంవత్సరాలునుంచి ఆ రిక్షా తన శరీరంలో ఓకీలులా తిరుగుతూంది. శ్యామల్ని యెత్తుకొని ఆడించేడు చిన్నతనంనుంచీని. ఆమెను పెంచిన తన హృదయంలో శ్యామలమీది సోదరీవాత్సల్యం చక్కగా పెరిగి,

పుష్పించింది. ఆ సౌరభం ఆనాటితో మరిరాదు. చీకూ చింతా లేకుండా ఇన్నాళ్లు పెరిగిన తన జీవితలత వేరొకవృక్షాన్ని ఆధారంచేసుకొని పాకిపోవాలి. ఇంకో చెట్టో పుట్టో దొరుకుతుందో దొరకదో...అతనికంతా శూన్యంగా కనిపించింది.

♦ ♦ ♦

మంగళతూర్యనాదాలతోటి, విప్రవరుల వేదఘోషలతోటి, పేరంటాండ్ర మంగళగీతికలతోటి శ్యామల వివాహం దేదీప్యమానంగా జరిగింది. సాయంత్రం పెళ్లి పెద్దలందరూ పోటో తీయించుకున్నారు. రాముడు శ్యామ బలవంతంమీద ఓమూల నుంచున్నాడు. తరువాత శ్యామల్ని తీసుకొని వెళ్లిపోతున్నారత్తవారు. వారితో రాముడుకూడా వెళదామనుకొని ఉబలాటపడ్డాడు గాని పనుంది ఆగిపొమ్మని శ్యామల తండ్రి అంటే ఆగిపోయేడు. పల్లకీలో మంచి సుభ్రదూపియైన బి. ఎ. పెళ్లికొడుకు యెదురుగుండా శ్యామల తలవంచుకొని కూర్చుండగా బోయీలెత్తేరు పల్లకి. అరుగునంటిపెట్టుకొని నుంచుండిపోయాడు రాముడు పల్లకీ వెళ్లిపోతూవుంటే దానికేసి తదేకధ్యాన్నంగా చూస్తూ.

♦ ♦ ♦

పాతికేళ్లు గిర్రుమని తిరిగిపోయేసరికి, కాలంలోనే గాదు, మనుష్యులలోకూడ వూహాకందని మార్పు కలిగిపోతుంది. నాటి పిన్నలు ఇప్పుడు పిన్నలకు పెద్దలై సంసారాలు దిద్దుకొంటూవుంటే ఆ మార్పును గుర్తించలేము.

పట్నంలో రంగంనుంచి వచ్చిన రామస్వామినాయుడుగారి మిల్లు అంటే పేదవాళ్లకి పెన్నిధిలా వుంది. 5 ఏళ్లు తిరిగేసరికి రామస్వామినాయుడుగారి ఖ్యాతి నలుదిశలా వ్యాపించింది. నిరుద్యోగ పట్టభద్రుల దగ్గరనుంచి, నిరక్షరాస్యులైన నీరసపు సంసారులందరికి అతడు దాత అయిపోయాడు. అందరికి అతనంటే పితృవాత్సల్యం.

నాటి రిక్షాలాన్కని పొట్టపోసుకున్న రాముడే నేడు మిల్లు యజమాని రామస్వామినాయుడు అంటే ఎవరైనా నమ్మతారా!

♦ ♦ ♦

నాడు నాయుడుగారి యింటికి వచ్చేవారు, పోయేవారుతోను చాలా హంగామాగాను, హడావిడిగాను వుంది. నాయుడుగారికి టైఫాయిడ్ జ్వరము చాల తీవ్రముగావుందని పట్నం అంతా విచారిస్తోంది. పనివాళ్లు ఎప్పుడు యేమాట వింటామో అని దిగులుగా భగవంతుణ్ణి ప్రార్థిస్తూ నాయుడుగారి యింటిముందు కూర్చున్నారు.

నాయుడుగారి గదిలోంచి అందరూ యీవలికి వచ్చేశారు నాయుడుగారి కోరికమీద. మిల్లు మేనేజరు గోపాలరావుపంతులు ఒక్కడుమాత్రము నాయుడుగారి మంచంప్రక్కన కూర్చునియున్నాడు. గోపాలరావుపంతులుమీద నాయుడుగారికి అమితమైన వాత్సల్యం. ఆయన నడవడి, కష్టానికి ఓర్చి పదిమందికి మంచిచేయాలనే స్వార్థరహితమైన నడత ఆయన్ని ముగ్ధుణ్ణిచేశాయి. కళ్లుతుడుచుకుంటూ

‘ఏమి శలవు?’ అన్నాడు పంతులు.

‘నాయనా, నాకు యిక శలవైంది. మిల్లునంతా అందులో పనిచేసే పనివాళ్లందరికీ యిచ్చేశాను. ఆసంఘానికి నీవుపెద్దవు. దాన్ని నీవు నేనులేని లోటులేకుండా నిరవాకంచెయ్యి. నీచేతుల్లో పెట్టుతూన్నాను. ఇంక ఒక్కటే కోర్కె వుంది. బేంకులోవున్న 50 వేల రూపాయిల్లోను సగం, చూడు, యీ ఫోటోలోవున్న

అమ్మాయికి యిచ్చివెయ్యాలి. మిగిలినది మిట్లుది. ఆమెకోరకు ప్రయత్నించాను రంగాన్నుంచి వచ్చినప్పటి నుంచీను. కాని ఆమెను చూచే భాగ్యానికి నేను నోచుకోలేదు. యీమె ఫలానా గణపతిరావు వకీలుగారి కూతురు...' అంటూ ఫోటో చేతికిచ్చాడు.

గోపాలరావుపంతులు ఫోటో అందుకుని చూచి నివ్వెరపడిపోయాడు—

గబగబ యీవలకువచ్చి కారుయెక్కి యింటికి వెళ్ళిపోయాడు. తిరిగి వెంటనే వచ్చేశాడు భార్యతో నాయుడుగారి దగ్గరకు.

నాయుడుగారు శ్యామలను చూచి 'అమ్మా, అమ్మా నిన్ను తిరిగి చూస్తాననుకోలేదు తల్లీ... రంగాన్నుంచి వచ్చి నీ చిన్ని చేతుల్లో ఒక చీర పెడదామనుకొన్నాను. అదిగో ఆ పెట్టెలో వుంది తీసుకో. నీ వాత్సల్యం, అభిమానంతో పెరిగిన దేహమే యిది. ఇదిగో యీ హృదయంలో యింకా ఉంది ఆనాటి నీ యనురాగం. గోపాలరావుగారు స్ఫోటకపు మచ్చలతో రూపుమారిపోయారు. తెలుసుకోలేకపోయాను. భగవంతుడు కలుపుతాడు. అతడు దయాసాగరుడు—'అంటూ శ్యామల రెండుచేతులూ పట్టుకున్నాడు.

వణుకుతోవున్న చేతులుమీద జలజలా రాలాయి శ్యామల కళ్ళల్లోంచి అశ్రువులు.

నాయుడుగారి గుండెమీదవున్న తన పెళ్ళినాటి ఫోటోకేసి శ్యామలచూచి యేదో చెప్పబోయింది. యింతలో నాయుడుగారి చేతులు నీటికుండలైపోయాయి. తలవనితలంపుగా జరిగిన యీ సంఘటనకు తెల్లబోతూ శ్యామల మరి మాట్లాడలేకపోయింది. అలాగే నివ్వెరబోయి నిలబడిపోయింది.

## చిత్ర వస్త్ర కారుఁడు

నేయుమా బట్ట సోదరా! నేయుమయ్యా
బిర బిరను విసరు కండె సంబరము తోడ
చూపుమా నీదు నేర్పుతో జూపుమోయి
ప్రకృతి యందున్న వింత సంభారములను,
పొరు, జిగి, రంగు మృదులతా సౌష్టవంబు
ముదురు, లేతల కలయిక సూహానంబు
గాగ సృష్టించు నేర్పు నీకడనె కలదు
సౌరభం బొక్కటే గూర్ప జాల వీవు
నేయుమా సోదరా నేయుమా నీవు—
సంజ కెంజాయల సవరింపు మయ్యా
ప్రతి తంతువున దయ పరిఢ విల్లంగ
ప్రతి దారమున కళల్ ప్రజ్వరిల్లంగ
ప్రతి సూత్రమున శాంతి ప్రబలు చుండంగ
సృష్టింపుమా చిత్ర చిత్రంబులైన
నిరుపేద పాలి పెన్నిధియైన శుద్ధ
దేశీయ వస్త్రకళా విశేషముల
ఎన్ని జన్మాల నెత్తిననేని జనుఁడు
ప్రోదిగా జేయ డొక్కాక పోగుతోడ
పడుగు పేకను గూర్చియు పంచనేసి
ఐకమత్యము నందున్న యతిశయంబు
చాటుచున్నావు ప్రజకు నిశ్శంక తోడ
చీర యందున తంతువుల్ జేరినట్లె
సర్వభూతంబు లందున సర్వసాక్షి
నిండి యున్న దటంచను నిజముమాకు
చూపుచుంటివే సోదరా! చూపుమయ్యా—

—విద్వాన్ శ్రీ వెం. కే. శర్మ.

# భావతరంగిణి   

'తన గృహంలో, తనతల్లివద్ద కన్య పొందుతూవున్న తరిఫీదు చాలాఉత్తమమైనది. కాని సంకుచితమైపోయిన నేటిమన సాంఘికవ్యవస్థలో కన్యకు సరియైన తరిఫీదు లభ్యమవటంలేదు. దానికి జపానులోవలె 'బ్రిదాల్ ట్రెయినింగు' మనదేశములోకూడ అవసరమనిపిస్తోంది. జపానులో కన్య వివాహమునకు అర్హతపొందుటకు ముందుగా కుట్టుపని వచ్చియుండాలి. ఆమెకు, సంసారమునకు సంబంధించిన ఆర్థిక విషయాలు, పిల్లలను పెంచడం, తీరికసమయాలలో ఏదోవొక గృహపరిశ్రమ చేయడం మొదలైన విషయాలు తప్పక తెలిసివుండాలి. ఇవి చేతకానిదే ఆమెకు వివాహము నిషేధము'

—సర్ మోక్షగుండం విశ్వేశ్వరయ్య.

'స్త్రీ పురుషులలో ఎవరైనను, ఎట్టివృత్తి నవలంబించుటకైనను ఎట్టిఅడ్డంకులు వుండకూడదు.'

—సర్ అల్లాడి కృష్ణస్వామయ్య.

'స్త్రీలు ముఖ్యంగా రాట్నాలమీద నూలువడకడం, ప్రథమచికిత్స, గృహకృత్య నిర్వహణం మొదలైనవి ముఖ్యముగా నేర్చుకోవాలి......ఘోషాపద్ధతిని వదలివేయాలి. స్వరాజ్యంకోసం పురుషులతో పాటు స్త్రీలుకూడా శ్రద్ధగా పనిచేయాలి.'

—బాబు రాజేంద్ర ప్రసాద్.

'పని, వ్రాత అంతా చక్కగా చేయగల స్త్రీలే నిర్వహించేటట్టు కాంగ్రెసు సంఘాలు, అభిమానులు తోడ్పడితే చాలాబాగుంటుంది. స్త్రీలయినా, పురుషులయినా, ఎవరు కార్యభారం వహించినా కాంగ్రెసు చరిత్రను, సత్యాగ్రహ అధ్యాయాన్ని అమోఘంగానడిపించి, చిరయశస్కులు కావడానికి మూలమైన ప్రతిస్త్రీవద్దకు, పల్లె పల్లెకు, మూలమూలకుపోయి, అదృశ్యంగా దిగివున్న ఆ రత్నాలను వెలువరించి, ఆ జీవనజ్యోతులను భావిచరిత్రలోని బంగారు పుటల్లో అలంకరింప జేయాలి.'

—పొణకా కనకమ్మ, ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ.

'మనపుత్రులకు, పుత్రికలకు కూడా అభివృద్ధి వికాసం సమానంగా కలగాలి. అందుకు అవకాశాలు కూడా సమానంగానే వుండాలి. ఆలాజరిగితేనేగాని భారతజాతికంతకు సమానంగా సమగ్రమైన అభివృద్ధి కలగదు........మనదేశానికంతకి హిందూస్థానీభాష సార్వజనిక భాషగావుండాలి. అందువల్ల ప్రజలలో ఐకమత్యం కట్టుబాటు మొదలైనవి చాలా అధికమౌతాయి.'

—బేగం హమీదాలీ.

స్త్రీలయొక్క శరీరబాధలనుగురించి స్త్రీ వైద్యులవద్దనే విపులముగా చెప్పుకోగలరు. అందుకు ముఖ్యముగా మనరాష్ట్రములో స్త్రీ వైద్యులు చాలామంది కావాలి. ఇందుకుగాను మద్రాసులోనున్న రెండు మెడికల్ కాలేజీలలోను కనీసము 100 సీట్లనైనా స్త్రీలకై ప్రత్యేకించుట ప్రభుత్వధర్మం. దీనికి స్త్రీలోకం తగిన ఆందోళన చేయాలి.'

—డాక్టరు ముత్తులక్ష్మి రెడ్డి.



SUNLIGHT SOAP
SUNLIGHT SOAP
SUNLIGHT SOAP
SUNLIGHT SOAP
LEVER BROTHERS (INDIA) LIMITED
SUNLIGHT SOAP

# శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠము,

## బెజవాడ.

**30-6-1940 తేదీన, బెజవాడ మునిసిపల్ ఛైర్మన్, సి. రాజగోపాలాచార్యులవారి యాజమాన్యమున జరిగిన సభలో, శ్రీమతి కవితిలక, కవితావిశారద విద్వాన్ కాంచనపల్లి కనకాంబగారిచే జదువబడిన పద్యములు**



చ. ఎవరిది వారికిం బగుచు నీయిల వేయివిధాలు వెల్లివా
స్తవమగు వేదశాస్త్రములు సత్కళలున్ రసవత్ప్రబంధముల్
సవనము లాశ్రమంబులును సద్గురుబోధము సాధుసేవలున్
నవవిధభక్తులున్ గడు ఘనంబులు మాకొరు సుద్దులేటికిన్.

చ. తిరుపతి వేంకటేశ్వరుఁడె దేశికమూర్తి త్రిలింగపీఠమున్
పరమ పవిత్రధర్మములఁ బాలనజేయఁ బ్రతిష్ఠచేసెనో
వరమతులార యివ్విజయవాటిక నేటికి రాజధానియై
స్థిరముగ నొప్పుదానికిఁ బ్రసిద్ధియు, సిద్ధియు, సిద్ధమేగదా.

మ. కులధర్మంబులు నిర్వహించుటయు జంకున్ మాని శ్రీ సద్గురూ
క్తులఁ బాలించుట వేదవాక్కులన యుక్తుల్ మాని కేల్మోడ్చుటు
జ్వలమా బ్రహ్మముపాస్యమంటయు సదాచారంబులో మాకు ని
క్కలిలో వేంకటనాయకుండొకఁడె నిక్కంబైనదిక్కారయన్.

మ. బ్రదుకంజాలక చావజాలకెటు లీప్రాణంబు లెడ్డేగునో
యదియుంగానక మానజాలకెది చేయంజాలకెందేని మం
చిదియే గానక దేవులాడుగద యీ జీవుం డహంకారమున్
మదిబూనున్ మమకారమూను బుధులన్ మన్నింపఁ డెన్నండునున్.

ఉ. వేదముగాదనున్ బుధుల వెల్లిలనున్ గురుదేవనిందకున్
మోదమునొందు, బెద్దల ఘనుండయి దిద్దును దోసమెంచు వ్యా
సాదుల, నార్యధర్మమపహాస్యమొనర్చెడు నేడొకండు దు
ర్వాదము నాస్తికత్వమపవాదము తోడుగ నెంతొ వేడుకన్.

శా. మింటంబాటిన నీటదూరినను భూమిన్ గల్చి తానేలినన్
గెంటంజాలునె కాలునిన్ హరినెదన్ గీర్తించి సంసారపున్
దంటాలన్ గడవంగ నేర్చునతఁడే ధన్యుండదేనాటికిన్
ఘంటానాదమువోలె వేదమది మ్రోగన్ జంక నింకేటికిన్.



'ఫీట్'



ముగ్గులతో 'హిందూదేశము'





## — శ్రీమతి —

## రాజుపాలెం లక్ష్మమ్మగారు

ఈమె గుంటూరుజిల్లా కోళ్లపూడి కాపురస్తురాలు. వైదిక బ్రాహ్మణులు; విద్యావతి. ఈమె వితంతువై, తిరిగి నియోగ బ్రాహ్మణులగు శ్రీయుత రాజుపాలెం రాధాకృష్ణమూర్తిగారిని ఇటీవల వివాహమాడిరి. ఆ ప్రాంతములో ఎన్నడు జరిగియుండని నియోగి వైదీకి మిశ్రిత వివాహబాంధవ్యములకు ఈమె మార్గదర్శినియైనది.





సీతాకోక చిలుక

చిన్నమాంబా ముద్రాలేఖినిపై తలకట్టులేని 'డ' అక్షరములను కూర్చి టైపు చేయబడినది.

ఉ. పీనుగు వెంటలౌచు బృథివీతలమింతయు గంపుకొట్టినన్
గానరు మానవుల్ శుభముగా మనుమార్గమహంకరించుటన్
మానరు దుష్టమార్గములు మాధవపాద సరోజ పూజపై
మానసమూన రీదురభిమానులు మూఢులెఱుంగ నేర్తురే.

మ. మనకున్, లేదని వారికున్నదనుచున్ మావారలగ్గింతురా
ఘనతన్ జూడమె నేడు మాడుగద లోకంబంత సంగ్రామభూ
మిని, గ్రామంబుల నాంధ్రబిడ్డలను బల్మిన్ జంపుటే యోగ్యమా
పనిగాఁ దోచెడు ధర్మమోక్షముల దల్పన్ వచ్చునే యచ్చటన్.

ఉ. ఆసురసంపదల్ ప్రబల నా సురసంపదలెల్ల కల్లగాఁ
జేసిరి చేయుచుండిరిక చిల్లరయోజనలెల్ల జేయుచున్
భూసురులే కలిప్రభవముల్ వికృతుల్ చెలరేగ విత్తనాల్
చేసినజాలు సత్కళల జిక్కిన దక్కిన వేదశాస్త్రముల్.

మ. పెరుమాళ్లన్నను బెద్దలన్న పరమప్రీతిన్ దదీయార్చనల్
జరుపన్ గావలె వేదశాస్త్రముల విశ్వాసంబుతో భక్తితో
శురహస్యంబుగ నేర్వగావలెను సంసారంబులో సారమా
హరినామంబని నమ్మగావలెను దేహస్ఫూర్తి బోనాడుచున్.

# ★ ఈ అవిద్య అంతమొందదా?

అక్షరాస్యుల సంఖ్య మనదేశమున అత్యల్పము. పదుగురిలో ఒక్కరికి అక్షర సంస్కారమున్నదని లెక్కలు చూపుచున్నవి. చదువ నేర్చినవారి సంఖ్య మన దేశమునకంటె బర్మాయందు మేలు. మన దేశములోకూడ అనగా, బ్రిటిషు హిందూదేశమునకంటె స్వదేశ సంస్థానములలో చదువనేర్చినవారి సంఖ్య హెచ్చు. మొదటిది కొచ్చిను; తరువాత తిరువాన్కూరు, బరోడా. స్త్రీల విద్యావిషయములో స్వదేశ సంస్థానములు ముందడుగు వేయుచున్నవి చదువనేర్చిన స్త్రీల సంఖ్య పురుషులతో పోల్చినచో

| | | | | | |
|---|---|---|---|---|---|
| స్త్రీలు | 1 | (కొంచము అధికము) | పురుషులు | 2 | కొచ్చినులో |
| ,, | 1 | (సుమారు) | ,, | 2 | తిరువాన్కూరు |
| ,, | 1 | (సుమారు) | ,, | 3 | బరోడా |
| ,, | 1 | (సుమారు) | ,, | 5 | మైసూరు |

విద్యావిషయములో మన దేశములో పార్శీలు జూపుచుండు పట్టుదల అమోఘము. వారిలో 100 టికి 80 వంతు విద్యావంతులున్నారు. క్రైస్తవులలో నూటికి 28 విద్యాగంధము నొందియున్నారు. హైందవులలో నూటికి 8 మంది విద్య నభ్యసించినవారు గలరు. ముస్లిములలో అర్గురికి చదువువచ్చును.

ఎక్కువ విద్యాసౌకర్యములుగల పట్టణములయందే చదువుకున్నవారు తక్కువైనప్పుడు, ఇక గ్రామసీమలమాట చెప్పవలయునా? నవయుగ నిర్మాణమును గావించుచున్నామని చెప్పికొను బ్రిటిషు పరిపాలిత ప్రదేశములందు ఇంత మంది నిరక్షరాస్యులున్న నవయుగ నిర్మాణమెక్కడ? ఈ అజ్ఞాన తమస్సునందికెంత కాలమిట్లు మనగలము. దీనికి తరుణోపాయములేదా ?

—శ్రీ దు. కృష్ణయ్య.

# శ్రీ వరలక్ష్మీ వ్రత కథ

శ్రీమతి పక్కి వెంకాయమ్మ

ఇప్పటికి రమారమి డబ్భై యెనభైయేళ్ల కిందట రాజమహేంద్రవరం సమీపంలో వున్న యినుగంటివారిపేట అనే చిన్న పల్లెటూళ్లో కనకమ్మ అనే ఒక కమ్మయిల్లాలు ఉండేదట. మా బామ్మ ఆ కనకమ్మ యింటిపేరుకూడా చెబుతూవచ్చింది, పత్తివారనో, దూదివారనో బాగా జ్ఞాపకంలేదు. ఆ కమ్మావిడ చదువుకోలేదు గాని, చదువుకున్నవాళ్లకంటే యెక్కువ సమాలోచన చేయగల బుద్ధిమంతురాలట. ఆ వూళ్లో బ్రాహ్మణపడుచులు యీ లక్ష్మీవ్రతం చెయ్యడం చూచి, కల్పం కథా వినీ, యేమనుకుందో తనుకూడా ఆ వ్రతం చెయ్యాలని ఉత్సాహపడిందట. వెంటనే పౌరోహిత్య బ్రాహ్మడి యింటికివెళ్లి ఆయనకు దణ్ణంపెట్టి 'అయ్యగారూ! నాకు వరలక్ష్మీ నోము నోచుకోవాలనుంది. మేం కమ్మవారం. నోచుకోవొచ్చునాండీ?' అని అడిగింది. ఆ బ్రాహ్మడు 'అయ్యో! అడ్డమేమమ్మా! అన్నివర్ణాలవారూ కూడా చెయ్యొచ్చునమ్మా' అన్నాడట. కనకమ్మ చాలా పేద సంసారిణి. నలుగురు పిల్లల తల్లి. పురోహితుడు చెప్పిన మాటవిని చాలా సంతోషించి 'బాబూ! మమ్మల్ని మీరెరుగుదురు. ఆ ఉన్న యకరం కొండ్రా దున్నుకుని యేదో ఓపూట గంజీ మెతుకులూ తిని రోజులు గడుపుకుంటున్నాం. ఇలాంటి మేము మీకేమివ్వగలం? మీరు మామీద దయవుంచి అసలు ఆ నోముకి యేంకావాలో చెబితే ఉన్నంతలో నాలుగు సరుకులూ సమకూర్చుకుంటాం' అని దీనంగా అడిగింది.

'కనకమ్మా! సరుకులు మాటకేంగాని, ముఖ్యంగా యీ వ్రతానికి కల్పంలో చెప్పబడిన ధర్మం చెబుతాను విను. ఈ వ్రతం చెయ్యదలుచుకున్న పుణ్యస్త్రీ లోకంలో అంతా సుఖపడాలనీ, కావలసినంత కలిమీ గట్రా కలిగి పేదసాదల్ని కనిపెడుతూ బిడ్డా పాపాతో కులుకుతూఉండాలనీ కోరుతూండాలి. తన లాభంకోసం యెన్నటికీ అబద్ధం చెప్పకూడదు. ప్రతిరోజూ తన యిల్లూ వొళ్లూ శుభ్రంగానూ చక్కగానూ నిర్మలంగానూ ఉంచుకుంటూ ఉండాలి. ఇంక వ్రతంరోజైన శ్రావణమాసంలోని పవర్ణమి ముందు శుక్రవారం నాడు నాలుగ్గళ్ల తెల్లారుగట్ల లేచి, యిల్లూ వాకిలీ శుభ్రంగా అలికి, ముగ్గులుపెట్టుకుని, తనూ మగడూ పిల్లలూ హాయిగా తలంటి నీళ్లోసుగుని, గుమ్మాలికి మామిడి, నేరేడు, మారేడు మొదలైన చిగురుకొమ్మల్తో తోరణాలు కట్టుకోవాలి. తరవాత మంచి సువాసనలుగల రకరకాల పువ్వులు దండలుగుచ్చి, యింట్లో పదిమందీ కూర్చోడానికి అనుకూలమైనచోట చిన్న పాలవెల్లి కట్టి, ఆ పాలవెల్లికి నేజెప్పిన దండలు అలంకరించాలి. యిలా యిల్లంతా సువాసనలతో నిండిన గాలితోటిన్ని మంచి వెలుతురుతోటిన్ని ఆకర్షకంగా ఉండేటట్టు అలంకరించి, ఆ పాలవెల్లికింద మహాలక్ష్మీదేవిని ఆవాహనచేసి పూజచెయ్యాలి. తన శక్తికొద్దీ ఆరోగ్యకరములైన భోజనపదార్థాలతో పేదలకూ సాదలకూ యింకా అర్హులైన బ్రాహ్మణులు మొదలైనవారికిన్ని భోజనములు పెట్టి, వారితోపాటు తాను, తన బంధువులు స్నేహితులు కలిసి భోంచేసి, ఆ రోజంతా సంతోషంగా పాటలుపాడుకుంటూ, నీతి న్యాయములు ప్రబలడానికిన్ని, లోకంలో అన్ని జంతుజాలాలూ హాయిగా బ్రతకడానికిన్ని, తమ శక్తియుక్తులు వినియోగించిన మహాత్ములైనవారి కథలున్ను, గృహమునందు స్వర్గసౌఖ్యం లభించడానికి అనుకూలమైన పద్ధతులు అవలంబించి సంసారం నడిపిన రమణీమణుల కథలున్ను వింటూ కాలక్షేపం చెయ్యాలి. తన యిల్లూ, వొళ్లూ, ప్రవర్తన, హృదయం, యివి మహాలక్ష్మీదేవిని అనగా ఐశ్వర్యాన్ని తన యిల్లు వొదలకుండా ఉండేటట్టు దిద్దుకోవాలి. విన్నావా? అమ్మా, కనకమ్మా! నేను పేద బ్రాహ్మణ్ణి. నీదయ ఉండి ఆ వ్రతం నన్ను చేయించమంటే నేనే చేయిస్తాను' అన్నాడు ఆ బ్రాహ్మడు.

ఇదంతా విని ఆ కమ్మ కనకమ్మ 'బాబయ్యాగారూ! మీరు చెప్పిందంతా చేస్తాను గాని, అసలు కావలసిన వేమిటో చెప్పారు కారు. కొబ్బరి బొండాలూ, అరటిపళ్లూ, తమలపాకులూ, ఊదొత్తులు, సాంబ్రాణి, హారతి కర్పూరం, డబ్బులు యిలాటివన్నీ కావొద్దండీ? చెప్పరేం?' అంది. 'ఇంకేమీ అన్నీ నీకే తెలుసునాయెను. అవన్ని సిద్ధంచేసుకోవడం మంచిది. మఱి నాకు పనుంది. నువ్వు వెళ్లి నోము యత్నంచేసుకో. సర్వవిధాలా నీ యిల్లు బంగారమై పిల్లాజెల్లాతో సుఖపడతావు' అన్నాడు ఆ బ్రాహ్మడు.

కనకమ్మ ఆయనను తనకు వ్రతం చేయించమని చెప్పి యింటికి వెళ్లిపోయింది.

* * *

ఆ రోజు శ్రావణ శుద్ధ దశమి గురువారం. కనకమ్మ రేపు మా యింటికి వరలక్ష్మీదేవి వస్తుందని యెంతో ఉత్సాహపడుతోంది. గురువారం పగలంతా పనిచేసి తన చిన్నయిల్లు బూజులు మొదలయినవన్నీ దులిపింది. అక్కడక్కడ చిన్నచిన్న దెబ్బలుతిన్న గోడలన్నీ చక్కగా మెత్తి, నున్నగా తయారుచేసి, కొత్త సున్నం రెండుసార్లు గోడలన్నిటికీ వేసింది. నేల అంతా ప్రతి గదీ ప్రతి వసారాలోనూకూడా కొత్త ఆవు పేడతో చక్కగా అలికి చూడడానికి యింపుగా ఉండేలాగ ముగ్గులుపెట్టింది. కనకమ్మ భర్తపేరు వీరాస్వామి. అతడు సాయంకాలం చేలోకి వెడుతూంటే కనకమ్మ 'పొలం బయలికెడుతున్నారు గాబోలు. యింటికొచ్చే టప్పుడు మామిడికొమ్మలూ, నేరేడు, మారేడుకొమ్మలూ తీసుకురాండి. రేపు శుక్కురారం. మనయింటికి శుక్కురారం మాలక్ష్మి ఒస్తుంది. అందుకు గుమ్మాలకి దూలాలకి అన్నింటికి తోరణాలు కట్టాలి' అంది.

అనుకున్నప్రకారం అన్ని సామగ్రులూ సిద్ధంచేసుకున్నారు. ఆ రాత్రి కనకమ్మకు తిన్నగా నిద్ర లేదు. జాము తెల్లవారుగట్లనే లేచి ముగ్గురు కొడుకులకూ మగనికీ తలఅంటి నీళ్లుపోసింది. తానున్న తలంటు గుంది. పొలములోకి పోతూఉన్న భర్తతో ఆమె 'ఏపంచి కట్టుగున్నారు? ఒదిలేసిన పంచి కట్టుగోకండి. ఇంకోపంచి ఉదికి ఆరేసిపెట్టాను, అది కట్టుగుని చాకలిది తెచ్చిన పంచి పైనేసుగెళ్లండి. మనం అంతా శుభ్రంగా ఉంటేగాని ఆ మాలక్ష్మి తల్లి రాదంట' అంది. పిల్లలకందఱికి చాకలి ఉదికితెచ్చిన బట్టలు కట్టింది. తాను ఉదికి ఆరవేసిన పట్టుచీర కట్టుగుంది. జాము ప్రొద్దెక్కేసరికి బ్రాహ్మణుడు రామయ్య వచ్చాడు.

రామ:—కనకమ్మా! చక్కగా అలంకరించావమ్మా.

కన:—అయితే అయ్యాగారూ! ఆ మాలక్ష్మి తల్లి మా యింటికొస్తుందాండి?

రామ:—వొస్తుంది. రాకేం జేస్తుంది? కాని ఒకవేళ యీ వారం రాకపోతే పైవారం రావొచ్చును. రాలేదని నోము మానకూడదు. యెన్నాళ్లకైనా ఆవిడకు దయకలిగి వచ్చిందాకా ఓపికతో యిలాగే చెప్పిన ప్రకారం భక్తి శ్రద్ధలతో నోము చేస్తూవుంటే యెప్పుడో ఒకప్పుడు తప్పకుండా వొస్తుంది.

ఆ రోజున చక్కగా కనకమ్మ కూతురినికూడా దగ్గిర కూర్చోబెట్టుకొని వ్రతం చేసింది. రెండు ఝాములు తిరిగిందాకా శుక్రవారపు మహాలక్ష్మి వస్తుందేమో అని యెదురెదురు చూచింది. రాలేదు. క్రమంగా ఆ నెలలో వచ్చిన మిగత రెండు శుక్రవారాలూకూడా వ్రతం చేసింది. శ్రావణమాసం వెళ్లి పోయింది శ్రావణంలో యిల్లు శుభ్రమేగా ఉంచడం, తాను, భర్త, పిల్లలు ఒళ్లూ బట్టలూ శుభ్రముగా ఉంచుకోవడంవల్ల మనస్సుకి కలిగిన ఒక విధమైన సంతోషానికి అలవాటుపడిన కనకమ్మ క్రమక్రమంగా ప్రతిరోజూ అలాగే పరిశుభ్రమైన విధాన్ని ప్రేమింపసాగింది. దినదినమూ యిల్లూవాకిలీ అంతా స్వచ్ఛంగా

ఉంచడమే కాకుండా మగపిల్లవాళ్ల చేత రకరకాల పువ్వులు తెప్పించి దండలు గుమ్మాలకు కట్టడం, కొప్పులో పెట్టుకోవడం, పిల్లల మెడలో వేయడం తద్వారా మంచి సువాసన అనుభవించడం మరిగింది. కనకమ్మకు ఇంట్లోనూ, దొడ్లోనూ, పరిసరాలనూ యేమాత్రం దుర్వాసనఉన్నట్లు గోచరించినా అందుకు కారణాన్ని తొలిగించేదాకా తోచేదికాదు. ఆవిడకి 'యీ స్థితిలో యీ చేసే లక్ష్మీపూజ ప్రతినిత్యం చేస్తే తప్పేముందీ?' అని తోచింది. అక్కడనుంచి తనయిల్లే స్వర్గం అనుకోతగిన దారిలో బడింది ఆమె నిత్యకృత్య ధర్మం. మనస్సుకి ప్రతి వస్తువును గురించీ శుభ్రతను గమనించడం స్వభావమైపోయింది కనకమ్మకి అందువల్ల తాగేనీరు, తినేవస్తువులూ, కట్టేబట్టలూ, నివసించేయిల్లూ, సంచరించే పరిసరములూ అన్నింటి విషయంలోనూ కడుశ్రద్ధ తీసుకొనేది. అటువంటి స్వచ్ఛమైన జీవనం ఆమెకు లభించడంతోటి ఆమెలోను ఆమె భర్తలోనూ బిడ్డలలోనూ సౌఖ్యకరమైన ఆరోగ్యం పెంపొందడం ప్రారంభమైనది. ఇంతలో మళ్లీ శ్రావణమాసం సమీపించింది.

శ్రావణమాసం ప్రవేశించకుండానే అనుకున్న ప్రకారం పశువులపాక చెలకలో వేసుగోవడమున్న యిల్లు బాగా యెత్తుచేసి మంచిగాలీ వెలుతురూ వచ్చేటట్టు కట్టుగోవడం జరిగింది. ఈ సంవత్సరం కనకమ్మ శ్రావణమాసంలో నాలుగు శుక్రవారాలేకాక నాలుగు మంగళవారాలూ మంగళ గౌరీపూజలుకూడా చేసింది. ప్రతిరోజూ చేసుకునే పూజ తానే యేదో 'లక్ష్మీ! అమ్మా! తల్లీ! మా యింటికి రావమ్మా' అని అర్థం యిచ్చే పాటపాడుతూ చేసేది. మంగళవార శుక్రవారాలు మాత్రం బ్రాహ్మణరామయ్యవచ్చి పూజ చేయించేవాడు. ఆయన కేదో తవ్విడుబియ్యం, ఒకఅణా డబ్బులూ, నాలుగు అరటిపళ్లు, రెండు తాంబూలాలూ యిస్తూవుండేది. ఇవి యిచ్చినప్పుడు రామయ్యగారు పొందే సంతోషాన్ని చూడగాచూడగా కనకమ్మ తన కున్నదానిలో ఉన్నంత యెవరికైనా యిచ్చి వారితోపాటు తానుకూడా సంతోషించడానిక్కూడా అలవాటు పడింది. ఆ సంవత్సరం శ్రావణమాసం మహా సంతోషంగా జరిగిపోయింది. ఆ కమ్మవారి కుటుంబాన్ని చూచి ఊళ్లో యింకా కొందరు యిల్లాళ్లుకూడా యీమెలాగే తాముస్నూ నోము చేయసాగారు. క్రమంగా యీ వ్రతం చేశేవారంతా ఒక సంఘంగా యేర్పడ్డారు.

కనకమ్మగారి మగబిడ్డలు ముగ్గురూ బాగా వ్రాయనూ, చదవనూ నేర్చి తనకు అక్షర జ్ఞానంలేక పోయిందని పశ్చాత్తాపపడుతూవున్న తమ తల్లికికూడా బాగా చదువ నేర్పారు. కనకమ్మ ముగ్గురు మగబిడ్డలూ వీరాస్వామీ వంతులు వేసుకొని రోజుకు నాలుగు గంటలకు తక్కువకాకుండా నూలువడికేవారు. అందఱూ కలిసి నాలుగుగంటలసేపు పొలంపని చేసేవారు. ఒకగంట మంచిమంచి గ్రంథములు చదివేవారు. ఒకగంట ఉత్సాహంగా మాట్లాడుకొనేవారు. మిగత యింటిపనులతోను, గృహాలంకారములు, ఆరోగ్యవిధానములు ఆచరణలోకి తెచ్చి పనిచేయడములోనూ కాలంపోతూ ఉండేది. ఈ పదేళ్లలోనూ క్రమంగా తమ పాటువల్ల లభించిన డబ్బులో మితంగా ఖర్చుపెట్టుగుంటూ సాధ్యమైనంతవఱకు కాయకష్టంవల్ల జరిగేపనుల నిమిత్తం డబ్బు ఖర్చుచేయకుండా సంఘంవారు అన్యోన్య సహాయంవల్ల పనులు నెరవేర్చుకుంటూ కొంత ధనంకూడ బెట్టుకొని దానితో నాలుగు యెకరములభూమి కొన్నారు. తుదకు యీ సంఘంవారంతా కలిసి జమీందారిణీగారికి దరఖాస్తుచేసి యెనిమిది యెకరముల మంచి మెరకస్థలం పొంది ఆ స్థలంలో విశాలమైన వీధులు యేర్పరచి ఆరోగ్య విధానములకు ఆదర్శకంగా ఉండేటట్లు సభ్యులు పదహారుగురు పదహారు విశాలములైన భవంతులు కట్టుగున్నారు. ఆ భవనములలో యెప్పుడుచూచినా నిత్యకళ్యాణం పచ్చతోరణంగా ఉండడమే కాకుండా నిత్య సంతుష్టి ఉండేది. ముఖ్యంగా చెప్పమరచిన సంగతి వారిలో యెవరికిగాని ఒకప్పుడైనా రోగం రావడము, వైద్యుని అవసరము అనేది లేనేలేక పోయిందట.

# క్రొత్తదైన చాలా పెద్ద సైజులో లక్సు



ఇప్పుడు నీ యొక్క సొగసైన వస్తువులనన్నిటిని నీకిష్టము వచ్చినపుడెల్ల పలుమారు లక్సుతో జాగ్రతగ నుంచుకొన వచ్చును. ఎందుకనిన నీ పైకమునకు ఈ పెద్ద సైజు లక్సు ఎక్కువ సోపును ఇచ్చుచున్నది. గట్టి రంగుగల పట్టు వస్త్రములను, కంబళము మొదలైన ఉన్ని వస్త్రములను చాల జాగ్రత్తగ లక్సు ఉతుకును. చల్లని నీటిలో లక్సు నురుగును ధారాళముగ నిచ్చును. నీ మలినమైనట్టి సూక్ష్మమైన వస్త్రముల లక్సు నురుగులో జాగ్రత్తగ పులిమిన, మలినమును చెమటయు పూర్తిగ తొలగిపోవును. ఎట్టి చెరుపును కలుగనీయక బాగుగ శుభ్రపరచును. చన్నీటిలో చెరుపులేక దేనిని నీవు తడపవచ్చునో దాని నన్నిటిని లక్సులో ఎట్టి హానిలేక ఉతక వచ్చును!

# క్రొత్త పెద్ద సైజు లక్సు

## కొనుటచేత నీ పైకమునకు ఎక్కువ సోపును పొందెదవు




చిన్న సైజు, సాధారణ సైజు లక్సు ప్యాకెట్లు కూడను నీ పైకమునకు గొప్ప ఆదాయము నిచ్చును.



# గానకళ  సంగీతోపాధ్యాయ శ్రీ గాలి పెంచల నరసింహారావు

రాగము: హిందోళము — ఆదితాళము

| | |
|---|---|
| ఆరోహణము: సమగమదనిస | స. గ. మ. ద. ని. సం. |
| అవరోహణము: సనిదమగస | ,, సా. షు. షు. కై. ,, |

వక్రమ ఔడవము.

20-వ మేళకర్తయగు "నఠభైరవి" యందు జన్యము

ఇయ్యది రెండవఉసిలో రెండు అక్షరములు త్రోసి పాడుకొనవలయును; వేలికి నాలుగుఅక్షరముల చొప్పున—

పల్లవి: పరమాత్ముని దరి - జేరగనౌనా
పరబోధలను విను - పామరులకు॥ పరమా॥

అనుపల్లవి: పరదాన్యము పర - ధనకాంతలనక
పరతత్వముగను - గొనువారికె గాక॥ పరమా॥

చరణము: ధర్మార్థకామమో - క్షార్థాత్మకై
మర్మంబులన్ తెలియ - జాలని నరులు
కర్మానుభవంబని - తెలుసుకొనక
నిర్మాతను నిందిం - చెడువారికి॥ పరమా॥

పల్లవి:

| | | |
|---|---|---|
| | | ,, - ,, - ,, సమ |
| | | ,, - ,, - ,, పర |
| మగమా గాసా సనిసా నిద నీ | సాసా మగమా | మా ,, - ,, సమ |
| మఅఆత్మ నిదఅరీజెఏఏ | రగనఉఊ | నా ,, - ,, పర |
| గమదమగాసా - సనిసానిద నీ | సాసా మగమా | మా ,, - ,, సమ |
| మఅఅత్ముని - దఅరీ - జెఏఏ | రగనఉఊ | నా ,, - ,, పర |
| గమదగమగసా - సనిగసనిద నీ | సనిసా గసగా | మా ,, - ,, సమ |
| మఅఅత్మ ఉఉనీ - దఅరిఇజెఏఏ | రఅగ - నఉఊ | నా ,, - ,, పర |

గమదగమగసగ - సనిగసనిదనీ | సనిసా సమగా | మా ,, - ,, సమ
మఅఅత్మ్మఉఉనిఇదఅరిఇజేఏఏ | రఅగ - నఉఉ | నా ,, - ,, పర
గమదనిసనిదమ - గమగసనిదనీ | సనిసా సమగా | మా ,, - ,, సమ
మఅఅఅత్మ్మఉనిఇదఅరిఇజేఏఏ | రఅగ నఉఊ | నా ,, - ,, పర
గమదని - సగసని - దమగసనిదనీ | సనిసా సమగా | మా ,, - ,, మగ
మఅఅ - త్మ్మఉనిఇ - దఅరిఇజేఏఏ | రఅగా - నఉఊ | నా ,, - ,, పర
గా ,, మామా - దాదా - నీనీ | దనిసని - దామా | మగమా - ,, మగ
బో ,, ధన - లను విను | పఅఅ - మరు | లఅకు - ,, పర
గా ,, మామా - దాదా - నీనీ | మదనిస - నిదనిద | మగమా - ,, మగ
బో ,, ధన - లను విను | పఅఅ - మఅరుఉ | లఅకు - ,, పర
గా ,, మామా - దమదా - నిదనీ | మదనిస - గసనిస | నిదనిద - మగ - మగ
బో ,, ధన - లఅను - విఇను | పఅఅ - మఅరుఉ | లఅకుఉ - ఉఉ - పర
గా ,, మగమా - దమదా - నిదనీ | దనిసగ - సగమగ | సగసనిదమ - మగ
బో ,, ధఅనా - లఅను - విఇను | పఅఅ - మఅరుఉ | లఅఅకుఉఉ - పర
గా ,, మగమా - దమదా - నిదనీ | దనిసగ - సగమగ | సనిదమగస - సమ
బో ,, ధఅన - లఅను - విఇను | పఅఅ - మఅరుఉ | లఅకుఉఉఉ - పర

మాత్మ్మని దరిజేరగనా నా॥

అనుపల్లవి :

| ,, - ,, - ,, - మద
| ,, - ,, - ,, పర

గా ,, మామా - దాదా నీదా | నీసా - సాసని | గసనిసనిద - మద
దా ,, స్యము - పర ధన | కాంతలఅ | నఅకఅఅ - పర
మగగా మామా - దాదానీసనిదా | దనిసా - సనిగస | నిసనిదనిద - మద
దఅఆస్యము - పరధాఅఅన | కంంతఅఅ | నఅఅకఅఅ - పర
మగగా మామా - దాదానీసనిదా | దనిసని - గసమగ | సగసనిదమ - మద
దఅఆస్యము - పరధాఅఅన | కంంంతఅలఅ | నఅఅకఅఅ - పర
మగగామామా - దాదానీసనిదా | దనిసగ సగమగ | సగసనిదమ - దని
దఅఆస్యము - పరధాఅఅన | కంంంతఅలఅ | నఅకఅఅ - పర
సా ,, సాసా - ,, నిసాగసా | సనిగస - నిదనీ | దమదమగమ - దని
త ,, త్వము - ,, గనుగొను | వఅఅఅరిఇకే | గఅఅకఅఅ - పర
సా ,, సాసా - నిససమగా , ససా | సనిగస - నిదసని | దమనిదమా దని
త ,, త్వము - గఅనుఉఊ , గొను | వఅఅ - రిఇకెఎ | గఅఅఅక - పర
నిసా , సాసని - నిససగాగసా | సనిగస - నిదసని | దమదమ - గమదని
తఅ , త్వముఉ - గఅనుఊగొను | వఅఅ - రిఇకెఎ | గఅఅకఅఅ - పర
నిసా , సాసా - సమగమగ ససా | సనిగస - నిదసని | దమదమ, గస, సమ
తఅ , త్వము - గఅనుఉఉగొను | వఅఅఅరిఇకెఎ | గఅఅ కఅ పర

మాత్మ్మని దరిజేరగనా నా॥

చరణము:

| | | |
|---|---|---|
| | | ,, - ,, - ,, సమ |
| | | ,, - ,, - ,, ధఅ |
| మా ,, మా - మా ,, మా - మా ,, | , ద - గమాదమా | గా సా - ,, సమ |
| ర్మార్ధకా ,, మ - మో ,, | , ఒక్షఅర్వాత | కై ఈ - ,, ధఅ |
| మా ,, మా - మా ,, మగ - గమదని | సానిదాసనీ | దమగసా, - సమ |
| ర్మా ,, ర్ధకా ,, మఅమొఒఒఒ | ఓక్షఅర్వాత | కైఇఇఈ, - మఅ |
| మగమగసా - సనిగస - నిదనిదనీ | ,, సమామగా | మామా - మా - సమ |
| ర్మఅఅఅంబు-లన్న్న్-తెవిలిఇయా | ,, జఆలనీ | నరు - లం - మఅ |
| గమదమ - గమగప - గసనిదనిదనీ | ,, సగమా , మగా | మామా - మా - మద |
| ర్మఅఆఅంబుఉలన్న్న తెవిలిఇయ | ,, జఅఆ , లని | నరు - లు - కఅ |
| గా ,, మామా - దాదా - నీదా | నీసా - సాసని | గసలిసనిద - మద |
| ర్మా ,, నుభ - వం - బని | తెలు - నుకొఒ | నఅకఅఅఅ - కఅ |
| మగగా - మామా - దాదా - నీసనిదా | దనిసగ - సగమగ | సగసనిదమ - దని |
| ర్మఅఆ - నుభవం - బఅఅనీ | తెవిలుఉ - నుఉకోబ | నఅఅకఅఆ - నిఇ |
| సా ,, - సాసా - ,, నిసాగసా | సనిగస - నిదనీ | దమదమ, గమ - దని |
| ర్మా ,, తనా - ,, నిండిం | చెవినుఉ - వఅఆ | రిఇకిఇఇఇ - నిఇ |
| నిసా , - సాసా - నిసస గాగసా | సనిగస - నిదసని , | దమదమ, గస - సమ |
| ర్మఆ , - తను - నిండింంం | చెవినుఉ - వఅఅఅ | రిఇఇకిఇఇ - పర |

మాత్ముని దరిజేరగనానా॥

చిట్టస్వరము.

| | | |
|---|---|---|
| | | ,, - ,, - ,, గా |
| మద గమదమ గమగస నిసనీసద | నిసనిస - మాగమ | గమదగ - మానిద |
| నిమదనిస నిసమాగ నిసానిమద | , దగమా - మగస | నిదనిమ - గమ॥ పర |

మాత్ముని దరిజేరగనానా॥

# ★ వరలక్ష్మీదేవి ★

శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ

శ్రావణభాగ్యలక్ష్మి! అహో! స్వాగతమమ్మ! దయామయీ! జగ
త్పావని! లోకపాలన విధానమతిన్ దయచేసినావె? ని
న్నేవిధినర్చసేయగల నీహృదయస్థితవై యథేచ్ఛగా
సేవలనంది వేనగవుచిందుల దీవనలిచ్చి బ్రోవుమా!

దీనహృదయాలపై పరాధీనమతిని కొలువుదీరిచి గుణములు కొలుతువంట!
కాన్కనిడుచుంటి నామనఃకమలదళము మనసుకందినదో? యొకమాటదెల్పు.

శ్రావణి! ఏవియత్పథపుఛాయలలో విహరింతొ చూపుకే
రావొక యేటిదాకను, పరామృశియింపుట లెవ్వడూరకే
పోవుదొ? మాకుటీరముల పొంతనొకించుక నిల్చి వర్షదు
ర్భావమెడల్చుమమ్మ వరలక్ష్మి దయామతి నాదరింపవే.

చల్లగావచ్చి శ్యామలశాద్వలములు ననలుగొనుచున్నవో ఏమొ? గనుమొకింత
వేడివేలుపు కాకలవాడిపోవు ఆలప్రేగులదన్ను తీయనిజలాల.

శ్యామల! దేవి! నీచరణసారసయుగ్మము నాశ్రయించి చే
తో ముదమంద గ్రామయువతుల్ నిను నిత్యము బూజసేతురే
సీమలె సర్వదావిడిది సేయగనీ కనువైనపట్లు ఏ
మేమొదలంచి యన్యమొనరింపకు మాపిలుపున్ గ్రహింపుమా!

నిలిచి నెమ్మది ఎటునిను గొలువవలెనొ తెలుపకున్న మాచేతకాగలది యేమి?
తామసింపకు లోకసంత్రాణమునకు విడిసినేడిట మావిందు గుడిచిపొమ్మ.

కలిమితల్లికి చదువులలలితకొకట పొందువడదంట ఇదిపటి పోటుమాట?
వమ్ముగాదాని ముల్లోకపాలకులును నిలిచి మాగృహముల సమర్చలనుగొనుడు.

వచ్చిపోవునెప్పుడు మగవారికేవొ పర్వములు మనకేటికి? వానిజోలి
కనుల పండువుగా పండుగలనుదనిపి ప్రముదమిడరమ్మ త్రైలోక్య రాణులార!

రండి! మాతల్లులార! ఏపండుగలకు లోటుచేయక మాపేద లోగిళులకు
క్రమముగా దసరాలు, సంక్రాంతిగడపి కలిసిరారమ్మ యొకట యుగాదినాడు.

# భారతీయనారి ★

శ్రీ స్వామి వివేకానంద

అనువాదం : శ్రీ పూర్ణానంద

నేను వివాహ మొనర్చుకొను ఆచారములేని సాంప్రదాయమునకు జెందియున్నాడను. అందువలన తల్లి, భార్య, కన్య, సహోదరీరూపముల ఇతరులవలె నారితో సంబంధ మొదగూరుట నాకు వీలు లేదు. తరువాత నేను గుర్తించు కొనవలసిన మరొక విషయము. భారతవర్షము కేవల మొక దేశముకాదు. అయ్యది విశాలమగు మహా ఖండము. అచ్చట చాలకుటుంబము లున్నవి.

నేను ధర్మ ప్రచారకుడనై ఎడతెగకుండ దేశదేశాంతరముల పరిభ్రమించి, సంఘమునందలి విభిన్న స్తరముల సంస్పర్శను బొంది, స్త్రీ జాతియొక్క పరిచయమును బొందువీలును ఇతరులకంటె నెక్కుడుగానే బొందితిని. ఉత్తర భారతమున పరదా విధానము విరివిగనున్నను, తద్దేశీయ నారులు ధర్మము కొఱకై ఈ నియమము నుల్లంఘింతురు. నావంటి పరివ్రాజకునితో సంభాషించుట, లేక ఉపదేశమును గ్రహింప సంకోచింపరు. అయినను నేను భారతీయనారి విషయమున సర్వజ్ఞుడనని నొక్కి చెప్పజాలను.

అందువలన, నేను కేవలము మీ సమ్ముఖమున భారతీయనారి ఆదర్శమును జూప యత్నింతును. ప్రతిజాతికి జెందిన నరుడును నారియును ఒక ఆదర్శమును గ్రహించును. జ్ఞానపూర్వకముగనో లేక తద్వ్యతిరిక్తముగనో అయ్యది వారి జీవితమున ప్రతిఫలించును. వ్యక్తి ఆదర్శముయొక్క బహిప్రకాశము. ఇట్టి వ్యక్తుల సమిష్టియేజాతి. ఈ జాతికి ఒకానొక ఆదర్శముండును. దానివైపునకే జాతియొక్క నిరంతరగతి. అందువలన, ఏదైన ఒకజాతిని ఎఱుగవలెనన్న, మొట్టమొదట దీని ఆదర్శము యొక్క పరిచయమును బొందుటావశ్యకము అను అభిప్రాయము అత్యంత సత్యము. ఏలయన, ఇతర జాతి స్థాపించిన మానదండమున విచారింప బూనుకొనిన ఏ జాతియొక్క పరిచయము బొందుట సంభవము కాదు.

వృద్ధి, ఉన్నతి, సమృద్ధిలేక అవనతులగుటెంచి చెల్లుబడిలోనున్న ఏ తూకమును గ్రహించినను, ఈ అభిప్రాయమే లభింపగలదు. ఏ వ్యక్తియొక్క యదార్థ పరిచయమును బొందగోరిన, తత్సంబంధమగు స్థాపిత మానమును (Standard) గ్రహింపవలెను. ఇయ్యది ఆ జాతియొక్క జీవితమున స్పష్టముగనే ప్రతీతమగును ఒక జాతి దృష్టిలో ఉత్తమ మగునది, మఱియొక్క జాతి దృష్టిలో ఉత్తమము కాకపోవచ్చును. దగ్గిర సంపర్కమున్న అన్న చెల్లెళ్ల పెళ్లి ఈ దేశమున ( అమెరికా ) సంపూర్ణముగ అనుమోదితము, కాని భారత దేశమున నియ్యది న్యాయవిరుద్ధము; కేవలము న్యాయవిరుద్ధమే కాదు, బీభత్సమగు వ్యభిచారముతో సమానము.

ఈ దేశమున విధవా వివాహము న్యాయవిహితము. కాని, భారత దేశమున ఉన్నత వర్ణముల మధ్య నియ్యది సంపూర్ణముగ వ్యభిచారము. మన కార్య కలాపములు ఇట్లు, విభిన్న భావముల నియంత్రితము లగుచున్నవని మన మిప్పుడు గాంచగలుగు చున్నారము; అందువలన నొకజాతిని మరియొక జాతియొక్క ఆదర్శముతో విచారించుట కేవల మన్యాయమే కాక, అసంభవముకూడ. ఆ జాతి ఏ విశేష ఆదర్శమును నిర్మించినది గ్రహించుటుచితము. విభిన్న జాతుల గుఱించి ఆలోచించునప్పుడు, మనము అన్ని జాతుల ఆదర్శము ఒకటేయను అభిప్రాయమున నడుతుము. మన విచారముయొక్క పర్యవసానము మనకు మంచిదైనది, ఇతరులకుగూడ మంచిది. మన ఆచారమే మంచిది. మన మాచరింపనిది ఇతరుల పట్లగూడ గర్హితము. నేను

కేవలము విమర్శించుట కొఱకై ఇట్లు నుడువు చున్నానను కొనవలదు. ఈ సత్యమును మీ అంతరమున ప్రవేశింప జేయ వాంఛితును. అమెరికాయువతులు చీనా యువతులను లోహ పాదుకల నుపయోగించి, పాదముల హ్రస్వీకరింతురని ఆక్షేపించునప్పుడు, వారు తాముపయోగించు కొరసెట్ (Corset) అంతకన్న ఎక్కుడు హానికరమను విషయమును మరతురుకాబోలు! ఇది మాత్రమొక ఉదాహరణ. ఈ కొరసెట్ను ధరించుటవలన స్నాయు వికృతి, మేరుదండ వికృతి సంభవించి దేహమునకు గలుగు అపకారముతో బోల్చిచూచిన, పాదముల హ్రస్వీకరించుటవలన గలుగు నష్టము లక్షాంశమున ఏకాంశముకూడగాదు. తులజాచు సమయమున ఈ వికృతము లన్నియును పట్టుపడును. ఈ విషయముల నేను కేవలము తప్పుల బట్టుకొన జెప్పుటలేదు. మీరు మిమ్ముల శ్రేష్ఠులుగదలచి ఇతర దేశముల రమణుల ఆచరణమున కలిక్కి పడునట్లు, వారు మిమ్ముల ననుకరింప కున్నందు వలన వారుగూడ మీరీతి నీతులగాంచి ఉలిక్కి పడుదురని నిరూపింప గోరుచున్నాడను. అందువలన పరస్పరము గ్రహించుటయందు వెలితియున్నదని తేలుచున్నది. కాని, ఒకానొక సాధారణ మూలమున్నది. ఒక సాధారణ జ్ఞాతవ్య ప్రదేశమున్నది. ఒక సాధారణ మానవ ధర్మమున్నది. అయ్యదియే మన కార్యమునకు సార్వజనీన మూలము కాగలదు. ఏ మానవ ప్రకృతియొక్క ఆంశికవికాసము సర్వత్ర కానబడు చుండునో, దాని సంపూర్ణతను వెదికి వెలికి దీయవలసి యుండును. ప్రకృతి ఏ వ్యక్తికిని సర్వవిషయముల సంపూర్ణత నొసగి యుండలేదు. మీరొక విశేషభూమికను ధరించి సంసార రంగమున బ్రవేశించినారు. ఎంత క్షుద్రమేయవనిమ్ము నాకుగూడ ఒనర్పవలసినది ఒకించుక యున్నది; ఇతరులకుగూడ ఒనర్ప వలసినది ఒకించుక యున్నది. ఇట్లే మఱియొకనికిగూడ. వ్యష్టుల మొత్తమే సమిష్టి. వ్యక్తిపక్షమున నెయ్యదియో, సమిష్టి పక్షమున గూడ నయ్యదియే. ప్రతిజాతికి ఒనర్పవలసినది ఒకించుక యున్నది; ప్రతిజాతికిని మానవ ప్రకృతియొక్క ఒక దిక్కును వికసింపజేయు భారమున్నది. మనమీ భావముల నన్నిటిని ఒకట గ్రహింపవలసి యున్నారము. సుదూర భవిష్యత్తున, ఈ విభిన్నజాతుల ఉపలబ్ధియగు విశేష అపూర్వ సిద్ధుల నన్నిటిని సమ్మిళిత మొనర్చు ఒకజాతి ఉద్భవింపగల ఆశయున్నది! ఈ జాతియొక్క ఉద్భవము జగత్తుయొక్క అపూర్వస్వప్నము. ఈ విషయముగాక నాకాలోచింపవలసిన దేమియును లేదు. నా జీవితమున నేను విశేషముగా జగత్తున పరిభ్ర మించితిని కాని, సర్వదా నా దృష్టిని ప్రసారిత మొనర్చి యుంచితిని. తిరుగు కొలది నా నోరు కట్టుపడు చున్నది. సమాలోచింపవలసిన దేమియు కనబడుట లేదు.

భారత దేశమున మేము ఆదర్శ రమణిని గుఱించి భావించు నప్పుడు, మాతృ భావమే మాయెదల నుదయమగును. మాతృత్వమే దాని అరంభము, మాతృత్వమే దాని పరిణామము. భగవానుని వారు 'అంబా' యని పిలుతురు. బాల్యకాలమున చిన్న పిల్లలు ప్రత్యహము ప్రాతఃకాలమున తల్లి యొక్క పాదోదకమును పాన మొనర్తురు.

పాశ్చాత్య దేశమున నారి, స్త్రీ శక్తి. అచ్చట నారీత్వము యొక్క అవగాహన స్త్రీ శక్తియందే కేంద్రీభూతము. భారతదేశమున సాధారణ మనుష్యుని కడగూడ సమస్త నారీ శక్తి మాతృత్వమున ఘనీభూత మగుచున్నది. పాశ్చాత్య దేశముల భార్యకుటుంబమును శాసించును; కాని భారత దేశమున సంసారము మాత యొక్క శాసనాధీనము. పాశ్చాత్య సంసారమున తల్లి, భార్య కధీనమై యుండవలయును; అచ్చట భార్యయే ( కోడలు ) సంసారమున సర్వమును. తల్లి సర్వదా మా దేశమున మా కుటుంబముననే యుండును; భార్య ఆమె యధీనమున. భావగతమగు సార్థక్య మెంతయో గమనింపుడు. (సశేషము)

# పుష్ప చయము * * *

## ★ కృత్రిమ సంతానోత్పత్తి–మహాత్ముని భావములు

“మాతృత్వము మంచిదేగాని, విషయలోలత్వము పనికిరాదు. గాజుపాత్రలలో కృత్రిమపద్ధతుల ద్వారా శిశువులను ఉత్పత్తిచేసినచో విషయలోలత్వము, కామప్రక్రియ లుండవుగదా! ఇట్లుచేసినచో ఆధ్యాత్మికాభివృద్ధిగూడ నుండునని మీరంగీకరింపరా?” అనే ఒకప్రశ్నకు మహాత్ముడు యీలా ప్రత్యుత్తరమిచ్చాడు.

“దీనివలనవిషయలోలత్వము నిర్మూలమైతే మీ పద్ధతిని నేను అంగీకరిస్తాను. విషయలోలత్వమువలన పురుషుడు, స్త్రీ బాగుగా అభివృద్ధికాజాలకున్నారను అభిప్రాయము నాకుఉన్నంతవరకు ఈ కృత్రిమ సంతానసాధనములను నేను ప్రతిఘటింపక తప్పదు. నాకు తోచినంతవరకు మీ పద్ధతివలన బుద్ధిహీనులు, రాక్షసులు, కామక్రోధ దుర్గుణపూర్ణులు నుద్భవింతురు. కామక్రోధాదులను నాశముచేయుట మానవుని పరమావధియైయుండ వాటిని వృద్ధిపరచుమానవులు ఈకృత్రిమ సాధనములవలన ఉత్పత్తియగుచున్నారు. కాని నేను ప్రాతకాలపు వాడనని నేను అంగీకరింతును. స్త్రీలు పురుషులు విలాసమునకై నడచుచు, తమపనులకు మోటారుకారులమీద, విమానములమీద పోవు నూతనయుగములో వివాహము రద్దయి, దానిస్థానే క్రొత్త పద్ధతులు రాగలయుగము నాకు యిష్టములేదు.

## ★ స్త్రీలకు అన్యాయము

ప్రెసిడెన్సీ కాలేజి (మదరాసు) లోని లిటరేచర్ ఆనర్సు క్లాసు సంగతిచూడండి. ఈ ఆనర్సు క్లాసులో మొదటి తరగతి (3rd years Hons) లో ఈ సం|| 14 మంది విద్యార్థినిలుచేరారు. కాని విద్యార్థులలో ఒక్కడే. అంతకు పైతరగతి (4thyear) లో ఆడువారి సంఖ్యలో సగముమాత్రమే మగవారు. ఆఖరుతరగతిలో ఆడువారిసంఖ్యలో మూడవవంతు మాత్రమే మగవారు. ఇతర క్లాసులలో మామూలే. కాని ఈసారస్వతం తరగతుల్లో ఆడువారిదే పైచేయి. మొదటితరగతిలోని విషయాల్నిచూచి కాలేజీ అధికారులు బెంబేలెత్తారు. ఇలాఉండడం తమ పురుషహోదాకు అవమానకరమనుకున్నారు కాబోలు! మరికొంత మంది మగవారికి ఎలాగో నచ్చచెప్పి బలవంతాన అయినా ఆ క్లాసులో చేర్చడానికి ప్రయత్నిస్తున్నారు. చేరిన 14 మంది ఆడువారికి ప్రత్యేకపరీక్షలు పెట్టి కొంతమందిని తీసివేయడానికి ప్రయత్నిస్తున్నారట. ఇదే నిజమయినట్లైతే ఇదెంతవరకు న్యాయమో లోకం ఆలోచించాలి. సారస్వతం పట్లఎక్కువ అభిమానంగలిగి ఎక్కువమంది ఆడవారు ఆ క్లాసులోచేరితే వీరికి వచ్చిననష్టం ఏమిటి? ఆడవారి అధికసంఖ్యను తగ్గించడానికి మాయోపాయాలెందుకు? ఇదే నిజమయినట్లయితే స్త్రీ జాతి; ముఖ్యంగా విద్యావంతులు దీనిని తమకొక అవమానంగాపాటించి తగిన చర్యతీసుకోవాలి. ప్రెసిడెన్సీ కాలేజిలో స్త్రీలు పురుషులను ఇలాంటి దీనస్థితికితరిమారు. ఆంధ్రవిశ్వ విద్యాలయంలో కూడ సోదరీమణులు ఇలాంటి విజయం పొందిరన్న శుభవార్త వినేభాగ్యం ఎన్నటికో?

(కాగడా)

## ★ ఇంజనీరింగు కాలేజీలో స్త్రీలు

ఈ సంవత్సరం ఇంజనీరింగు కాలేజీలో యిద్దరు యువతులు చేర్చుకోబడ్డారు. ఇంజనీరింగు కాలేజి చరిత్రలో యిదే ప్రథమ పర్యాయముగ స్త్రీలు యీ సంవత్సరము చేర్చుకోబడ్డారు.

## ★ ప్రాణాయామమువలన స్త్రీల కారోగ్యము

కుడిచేతి బొటనవ్రేలితో కుడిముక్కును మూసుకొని నెమ్మదిగా ఊపిరిపీల్చి బాగా స్తంభించిన తర్వాత క్రమముగా ఊపిరి విడవాలి. మరల 6 సెకండ్లు స్తంభించి తిరిగి ఊపిరి పీల్చాలి. ఈరీతిగా 15 సార్లు చేసిన తర్వాత ఎడమముక్కు మూసుకొని కుడిముక్కుతో అదేవిధంగా అభ్యసించాలి

నోటితో తొమ్మిదిసారులు ఊపిరిపీల్చి 4 సెకండ్లు స్తంభించి మరల నోటితోనే 12 సార్లు ఊపిరి విడవాలి. ఒకరోజుకు ఈ విధముగా 20 సార్లుచేస్తూ, 50 వరకు ఒక్కొక్కటి చొప్పున వృద్ధిచేసు కుంటూ రావాలి.

ఒక కుర్చీలో తిన్నగాకూర్చుని నోటితో బాగా ఊపిరిపీల్చి, నోరుమూసుకొని గడ్డముతో మోకాలు నంటునంతవరకు వంగి నెమ్మదిగా ముక్కుతో ఊపిరిని బయిటికి విడవాలి. రోజుకు 8 వంతున ఇట్లే హెచ్చించి 16 వరకు చేయాలి.

తిన్నగా నిలబడి రొమ్మున గడ్డమంటునట్లుగా వంగి చివుక్కున తలను వెనకకు వంచి ఊపిరిపీల్చి బాగా స్తంభించి మరల ముందుకు వంగి ఊపిరివిడవాలి. ఇట్లే 60 సార్లతో ప్రారంభించి నూరువరకు రోజుకొక్కటిగా హెచ్చిస్తూరావాలి.

తిన్నగా నిలబడి రెండుచేతుల· ఒక్కసారిగా మొదట కుడిప్రక్కగా తర్వాత ఎడమప్రక్కగా ఊపుతూ ముక్కుతో ఊపిరిపీల్చాలి. దీన్ని 30 లో ప్రారంభించి 50 వరకు రోజుకొక్కటిగా హెచ్చించుకోనాలి.

### ఇసుకకడ్డీ వ్యాయామము

ఎత్తుగా అమర్చబడిన కడ్డీని రెండుచేతులతో పట్టుకొని, ఎడమకాలి బొటనవేలు భూమికాన్చి కుడికాలిని ముందుకు వెనక్కు బాగా ఊపాలి. ఇట్లేకాలుమార్చి కాలు 25 సార్లు ఊపాలి. 50 వరకు హెచ్చించు కొనవచ్చు.

కుడిచేతితో కడ్డీని పట్టుకొని ఎడమచేతి ప్రక్కకు వ్రాలి, అదేతీరున ఊపుతూ, ముక్కుతో ఊపిరి పీల్చాలి. మరల ఎడమచేతితో పట్టుకొని ఆవిధముగానే ఊగాలి.

రెండుచేతులతో కడ్డీలను పట్టుకొని కాళ్లుపైకెత్తి మోకాళ్లుముడుచుకొని ఇటు అటు ఊగాలి. నోరు మూసుకొని ముక్కుతోనే శ్వాసపీల్చాలి.

రెండుచేతులతో కడ్డీని పట్టుకొని గడ్డముకూడ కడ్డీకిఆన్చి, వూపిరి బిగపట్టి 4 సార్లు ఊగాలి. ఇట్లే మూడురోజుల కొకటిగా హెచ్చించి, 25 సార్లవరకు అభ్యసించాలి.

## ★ శ్రీమతి విజయలక్ష్మి పండిట్‌గారికి చైనానుండి ఆహ్వానం

"మీరున్ను మీప్రతినిధివర్గము వారందరున్ను చీనాకు రావలెనని చీనాలో యావన్నంది స్త్రీలపక్షమునను నేను సంతోషపూర్వకంగా మిమ్మల్నందరినీ ఆహ్వానిస్తున్నాను. జపానువారి విమానాలు పట్టపగలువెలుతురు బాగుగా వున్నప్పుడుకూడ నిరపరాధులైన ప్రజలమీద సైతముబాంబులను వేస్తున్నాయి కనుక మీరందరూ అక్టోబరులోగాని నవంబరులోగాని రాగోరుతాను." అంటూ డిక్టేటర్ మార్షల్ చియాంగ్-కే-షేకుగారి భార్య శ్రీమతి విజయలక్ష్మి పండిట్‌గారికి వ్రాసినారు.




### గోధుమలుతో తయారుచేయదగిన వివిధ పదార్థములు 2.

## బెనారస్ కాజా

ఒక అరవీశ గోధుమపిండి, అరసోలెడు నెయ్యి, కొట్టినఉప్పు ఒకచిటిక, వీటిని నీటితో గట్టిగ కలపవలెను. 2 గంటలు నాననిచ్చి నేతితో బాగ మర్దించి నిమ్మకాయంత వుండలు చేసివుంచి, అరపంపు శనగపిండి, 1 పంపు నెయ్యికలిపి, ఒకపూరీవత్తి దానిపై నెయ్యితో కలపిన శనగపిండి రాయవలెను. తరువాత మరియొకపూరీ పైనవేసి చాపవలె చుట్టవలెను. దానిని అడ్డముగ చాకుతోకోసి, అప్పడాలకర్రతో ప్రతిముక్కను నిలువుగ ఒకసారి మాత్రం వత్తవలెను. అరవీశ పంచదార పాకం లేతగాపట్టి సన్ననినిప్పు శగమీదవుంచి, 1 శేరు నెయ్యి బూర్లమూకుటులోపోసి బాగా మరగనిచ్చి కాజాలు సరిగ వేయించి పాకంలో వేయవలెను. 5 నిమిషములకు వాటిని మరియొకచోట పెట్టవలెను. ఒక ఏబులం పంచదార వేరేపాకం పట్టి ఆకర్ని కాజాల పైనపోయవలెను.

## రవ కేసరి

నాలుగుతులముల నెయ్యి కాగనిచ్చి, పావుశేరు గోధుమనూకను వేసి కమ్మగా వేయించి, అర్ధశేరు పాలుపోసి వుడకపెట్టవలెను. 10 నిమిషము లుడకనిచ్చి, పావుసేరు పంచదారను వేసి కలిపిన తరువాత, పావు తులం ఏలకపొడి, 1 తులం కిస్మిస్, 4 తులముల జీడిపప్పు నేతిలో వేయించి, ¼ తులం కుంకుమపువ్వు, వేసి కలియపెట్టి, అరపంపు నెయ్యికాచి పోయవలెను 5 నిమిషములకు దింపి పళ్లెంలో పెట్టవలెను.

## రవ దోసె

ఒకతవ్వ గోధుమనూక, అరసోలడు వరిపిండి, సోలడుమజ్జిగ 1 తవ్వ నీరుపోసి సాయంత్రం కలపవలెను. మరునాడు, అల్లం ఒకతులం, అరతులం పచ్చిమిరపకాయలు, అరతులం ఉప్పు మెత్తగా రోటిలో తొక్కి వేయవలెను. 4 తులములు కొబ్బరి క్కోరువేసి, తావారేకుమీద నెయ్యివేసి కాగినతరువాత అట్లు వేయవలెను. దోశె వేగినపిదప తిరగవేసి కొంచెం నెయ్యివేసి తీయవలెను.

## పాల పూరి

ఒక ఏబులం గోధుమపిండి, అరసోలడుపాలు, 2 తులములు నెయ్యి కందిబద్దంత ఉప్పువేసి నీటితో గట్టిగ కలపవలెను. 2 గంటలు నాననతర్వాత మర్దించి అవసరమయినంత వుండలు చేయవలెను. 1 శేరు పాలుకాచి, ఏబులం పంచదార, పంపు నేతితో వేయించిన జీడిపప్పు, 4 తులములు కిస్మిస్, అరతులం ఏలకపొడి వేసి కలపవలెను. అరవీశెనెయ్యి మరగనిచ్చి, కొంచం దళసరిగవత్తి పూరీలు వేయించవలెను. వేగిన పూరీలు పాలలో వేయవలెను.

# రవ ఇడ్డెన్

పావుశేరు మినప్పప్పు, 4 గంటలు నీటిలో నానపెట్టి మెత్తగా రుబ్బవలెను. ఒకతవ్వ గోధుమ నూకను కలిపి సాయంత్రం వుంచవలెను. ఒకతులం పచ్చిమిరపముక్కలు, అరతులం అల్లంముక్కలు, అరతులం కొట్టినఉప్పు పిండిలోకలిపి, ఇడ్లీపాత్రతో మామూలుగా వండవలెను.

# రవ లడ్డు

అరపడి గోధుమనూకను ఆశాను నెయ్యివేసి వేయించవలెను. 5 ఫలముల జీడిపప్పు, 2 ఫలం కిస్మిస్ నేతిలో వేయించి వేయవలెను. అరపడి పంచదార, 1 తులం ఏలకపొడి ఒక కొబ్బరికాయ కోరి వేయించి అన్నివేగిన నూకలో కలపవలెను. ఒకఆశాను కాచిననెయ్యి, 2 ఆశాసుల కాచిన పాలుపోసి మొత్తం అన్నికలిపి వుండలు చేయవలెను.

# రవ ఒడియాలు

మూడుతవ్వలనీరు వెడల్పుగిన్నెలో మరగనిచ్చి, ఒకతులం ఉప్పు, 2 తులములు పచ్చిమిరపకాయలు మెత్తగా రుబ్బి నీటిలో వేయవలెను. శనగగింజంత ఇంగువపొడి, అరసోలడు సగ్గుబియ్యంపోసి 15 నిమిషములు వుడకనిచ్చి ఒకతవ్వ రవపోసి అరగంట వుడకపెట్టి దింపవలెను. ఒక తడిబట్టమీద జంతిగి కర్రతోతిప్పి ఎండ పెట్టవలెను. 4 ఎండలుఎండిన తర్వాత, నెయ్యి మరగనిచ్చి వేయించవలెను.

# రవ పులిహోర

1 తవ్వనీరు మరగపెట్టి 1 పావునేరు రవపోసి నీటిని బాగా వార్చవలెను. 5 నిమిషములకు దింపి పళ్లెంలోనికి తీసి పావుతులం కొట్టినఉప్పు, కొంచం కర్వేపాకు, వడ్లగింజంత పసుపు, 2 తులముల మంచినూని వేసి కలపవలెను. ఒక గిన్నెలో 2 తులముల నెయ్యివేసి అరతులం ఎండుమిరపముక్కలు, తులం మినపపప్పు, అరతులం ఆవాలు, తులం శనగపప్పు, శనగబద్దంత ఇంగువ, పావుతులం మెంతులు, అన్ని ఎర్రగావేయించి, పావుతులం కర్వేపాకువేసి, నూకను పోపులోవేసి బాగా కలియపెట్టి 3 నిమ్మపళ్లుకోసి రసం పిండవలెను.

# పాకం పూరీ

అరవీశ గోధుమపిండి, 4 తులముల నెయ్యివేసి నీటితో గట్టిగకలిపి 2 గంటలు నానినతరువాత నిమ్మకాయంత వుండలుచేసి అర్ధరూపాయ దళసరి పూరీలు వత్తవలెను. శేరు పంచదార లేతపాకంపట్టి సన్నని నిప్పుమీద వుంచవలెను. శేరు నెయ్యి కాగనిచ్చి పూరీవేయించి పాకంలోవేసి 5 నిమిషములకు తీసి వేరే వుంచవలెను.

# గోధుమ జిలేబీ

ఒకగ్లాసు గోధుమపిండి, 8-వ వంతు మజ్జిగ, నీరుపోసి పెరుగువలె కలపవలెను. 2 గంటలు నాన పెట్టి, 4 గ్లాసుల నెయ్యి వెడల్పయిన పాత్రలోపోసి మరగనిచ్చి జిలేబీగిన్నెతో పిండిని తిప్పవలెను. 2 గ్లాసుల పంచదార లేతపాకంపట్టి వేగిన జిలేబీ వేయవలెను. 10 నిమిషములకు తీసి వేరే పెట్టవలెను.

—శ్రీమతి సి. హెచ్. అన్నపూర్ణాబాయి.

## ఉడికించిన రొట్టెలు

ఒకశేరుపాలను కళాయిపాత్రలోపోసి అర్ధశేరుపాలు అయ్యేటట్టు మరిగించవలెను. తరువాత 13 తులముల పంచదారనువేసి కలుపవలెను. వుడుకుచున్నపాలలో 4 తులముల నెయ్యివేసి గరిటెతోకలిపి దింపవలెను 18 తులముల రవ్వను 9 తులముల పాలలోకలిపి మర్ధించి వుసిరికాయలంత వుండలుగాచేసి అప్పడములవలెచేసి వీటినిఒత్తి ఆవిరిలో వుడికించి తీసి సిద్ధమైయున్న పాకములో వేయవలెను.

## బియ్యము రొట్టెలు

5 తులముల గోధుమపిండి 12 తులముల బియ్యపుపిండి పావుతులం వుప్పు పళ్లెములోపోసి 8 తులముల నీటిలోకలిపి మర్ధించి నిమ్మకాయలంత వుండలుచేసి పూరీలాగునే వెడల్పుగాఒత్తి పెనముమీద కాల్చి వెంటనే నిప్పులమీద కాల్చవలెను.

## రవ్వ-శనగపిండి కలిపిన జిలేబీ

40 తులముల రవ్వను 8 తులముల శనగపిండి 4 తులముల బియ్యపిండి 8 తులముల నెయ్యి ఈ నాలుగింటినీ కళాయిపాత్రలోపోసి నీళ్లతోకలిపి దానిలో 3 నిమ్మకాయలరసమును కలుపవలెను. తీగసాగిన రీతిగా కలిపి ఒకరాత్రి వుంచవలెను. ప్రొద్దున్న 60 తులముల చక్కెర ఒక కళాయిలోవేసి దానిలో ఒక గిద్దెడుపాలు గిద్దెడునీళ్లువేసి కలిపి పొయ్యిమీదపెట్టి లేతపాకమురాగానే దింపవలెను. కాగిన నేతిలో కలిపియుంచిన పిండిని ఒక కొబ్బరిచిప్పలో వేసి జంతికలువలె తిప్పి వేగినతరువాత పాకములోముంచి తీయవలెను.

—శ్రీమతి గోపరాజు వెంకటరత్నమ్మ.

## పొటేటో భాత్

¾ శేరు గోధుమనూకను కొలిచిపెట్టుకొనవలయును. ఒక కొబ్బరికాయను కొట్టి, దానిని పాలుతీసి వుంచవలెను. 10 ఫలముల బంగాళదుంపలను ముక్కలుగా కోసి, 3 ఫలముల వుల్లిపాయలును, 6 పచ్చిమిరపకాయలును పొడవుగా తరిగి వుంచుకొనవలెను. 1 ఫలం నేతిలో 2 ఫలముల జీడిపప్పును ఎర్రగా వేయించవలెను. 5 ఏలకపండ్లను చితకగొట్టి, దానితో ఒక కానీ బిరంజి ఆకు, ఒక కానీ లవంగపట్టను జతచేర్చి, పై నెయ్యిలో పోపుపెట్టి, నీరుల్లి ముక్కలను, పచ్చిమిరపకాయ ముక్కలును దానిలో ఎర్రగా వాడ్చిన పిదప బంగాళాదుంప ముక్కలను అందులో వేసి, కొబ్బరిపాలున్నూ, కొంచెము నీరున్నూ కలిపి, మొత్తం ¾ శేరుగా వుండేటట్లు కొలిచి, దానిలో 1 చంచా వుప్పును వేసి, పై పోపులో పోసి, అది మరిగినపిదప గోధుమనూకను వేసి, జీడిపప్పును వేసి కలిపి దించవలెను.

## సొజ్జి

¼ శేరు గోధుమనూకను ¼ తూనిక శేరు బెల్లం పాత్రలోవేసి, ¼ శేరు నీరుపోసి మరగించవలెను. అది మరగినతర్వాత దానిలో గోధుమనూకనువేసి కలుపుతూ, 1 ఫలం నెయ్యిపోసి బాగుగా కలిపి, వుడికిన తర్వాత 8 ఏలకాయల పొడివేసి, 1 ఫలం జీడిపప్పు, 1 ఫలం ద్రాక్షవేసి కలిపి దించుకొనవలెను.

# గవ్వలు

2 కొబ్బరికాయలు కోరి, చిక్కగా $\frac{1}{4}$ శేరు అవునట్లుగా పాలుతీసుకొని, శేరు గోధుమనూకను ఈ పాలతో తడిపి బాగా ముద్దఅయేలాగున కలిపి వుంచవలెను. 4 గంటలసేపు నానినతర్వాత దానిలో చిటికడు కొట్టిన వుప్పునువేసి బాగా మర్దనచేయవలెను. 15 నిమిషములు మర్దనచేసిన తర్వాత గచ్చకాయ అంత వుండలుచేసికొని, దానిని గవ్వలపీటమీదగాని లేక సన్న పండ్లదువ్వెనమీదగాని ఒక్కొక్కవుండను బొటనవ్రేలితో గట్టిగా అదిమి, తర్వాత దానిని చుట్టలవలె చుట్టవలెను. పొయ్యిమీద పాత్రనువుంచి దానిలో $\frac{1}{2}$ వీశ పంచదారను అరగ్లాసు నీరుపోసి కొంచెము ముదురుపాకమును పట్టవలెను. గోరుమీదవుంచిన ముద్దగా నిలుచునట్లు పాకము పట్టవలెను. తర్వాత కళాయిలో నెయ్యి 10 ఫలములను కరగించి పై గవ్వలను కొద్దికొద్దిగా ఎర్రగా వేయించి వాటిని పాకములో వేయవలెను.

# డయిమన్ కట్స్

$\frac{1}{2}$ శేరు గోధుమపిండిని ముద్దగా తడిపివుంచవలెను. 2 గంటలసేపు నానినతర్వాత బాగా మర్దన చేసి నిమ్మకాయంత సైజు వుండలను చేసికొని పూరీలు వత్తవలెను. తర్వాత దానిని చాకుతో నలుచవుకముగా కొండణాల కాను అంత వురవున కోసికొని, 10 ఫలముల మరగిన నేతిలో ఎర్రగా వేయించి తీసుకొనవలెను. తర్వాత 15 ఫలముల పంచదారను కొంచెము లేతపాకముగా పట్టి వేయించిన డయిమన్ కట్స్‌ను అందులో వేయవలెను.

# రవ లడ్డు

10 ఫలముల నెయ్యిని మరగించి 5 ఫలములు సన్నగాకోసిన జీడిపప్పు, 2 ఫలముల ద్రాక్షను ఎర్రగా వేయించి తీసుకొనినపిదప ఆనేతిలో $\frac{1}{2}$ శేరు గోధుమనూకను వేయించి రోటిలోవేసి మెత్తగా దంచ వలెను. గుండ అయినపిదప $\frac{1}{2}$ శేరు (బూరా) పంచదారను వేసి, జీడిపప్పు, ద్రాక్ష, 10 ఏలకకాయల పొడుము, $\frac{1}{4}$ తులం కుంకుమపువ్వును వేసి ఎంత వురువు కావలెనో ఆరీతిగా వుండలు కట్టవలెను.

# పాకము లడ్డు

5 ఫలముల నెయ్యిని మరగించి దానిలో 5 ఫలముల జీడిపప్పు, 2 ఫలముల ద్రాక్షను ఎర్రగా వేయించి తీసికొనినపిదప $\frac{1}{2}$ శేరు గోధుమనూకను దానిలోవేసి కొద్దిగా వేయించవలెను. తర్వాత $\frac{1}{2}$ శేరు పంచదారను కొంచెము అనగా ఒక గ్లాసెడు నీళ్లతో తీగెపాకమువలె పట్టవలెను. ఆ పాకములో వేయించిన గోధుమనూకను, జీడిపప్పు వగయిరా సామగ్రులను వేసి లడ్డువుండలను కట్టవలెను.

# గోధుమ సోమాసిలు

$\frac{1}{2}$ శేరు గోధుమపిండిని ముద్దగా తడిపి వుంచుకొనవలెను. $\frac{3}{4}$ వీశ బంగాళాదుంపలను ముక్కలు కోసి వుడికించి తోలువలచి దానిలో మనకు కావలసిన కారముపొడిని, కొంచెము పసుపుగుండను, కొంచెము కొట్టిన వుప్పును వేసి మెత్తగా చేతితో పిసకవలయును. దానిని కొంచెము నూనెలో మినపప్పు $\frac{1}{2}$ గిద్దడు, $\frac{1}{2}$ గిద్ద శనగపప్పును, కొంచెము కరివేపాకును, కొంచెము ఆవాలును, 2 ఎండు మిరపకాయలను పోపుతో వేయించి బంగాళాదుంపముద్దను వేసి కలబెట్టి తీసుకొనవలెను. పై గోధుమపిండిని చిన్న నిమ్మకాయంత వుండ లనుచేసి దానిని పూరీలు వత్తి, దానిలో వేయించిన బంగాళాదుంప కూరను పొదిపి, కజ్జికాయలను చుట్ట వలెను. 5 ఫలముల నెయ్యిని, 5 ఫలముల నూనెను మరగించి, దానిలో కజ్జికాయలను మాడిపోకుండ ఎర్రగా వేయించి తీసుకొనవలెను.

## అత్తిరసములు

½ శేరు గోధుమపిండిలో 5 ఫలముల బెల్లమును పొడిచేసి గట్టిగా తడిపి వుంచుకొనవలెను. ఒక పళ్లెములో 5 ఫలముల గసగసాలను పోసి వుంచుకొనవలెను. పై పిండిని మనకు కావలసిన సైజుగా చిన్నచిన్న బిళ్లలవలె చేతితో వత్తి, 5 ఫలముల నూనెగాని నెయ్యిగాని మరగించి దానిలో బిళ్లలను వేయించి తీసుకొని, వాటిని గసగసాలతో అద్దవలెను.

## ఉప్పు బిస్కొత్తులు

1 శేరు గోధుమపిండిని, 1 కప్పు నెయ్యిలో కలుపవలెను. ముందు 1 కప్పు నెయ్యిని చేతిలో రంగరించవలెను. నెయ్యి బాగా నురుగువచ్చినతర్వాత, గోధుమపిండినివేసి ఒకస్పూను టేబిల్‌సాల్టును, ఒక స్పూను, బేకింగు (Baking Powder) పొడరునువేసి బాగా ముద్దగా కలుపవలెను. ముద్దకట్టనిచో 2 అవున్సుల పాలతో కలుపవచ్చును. 4 గంటలసేపు నానినతర్వాత దానిని మరల మర్దనచేసి మనకు కావలసిన వురువుగా బిళ్లలనుచేసి దానిని చీపురుపుల్లతో 5 చిల్లులను పొడవవలెను. ఒకపెద్దపాత్రను నిప్పులదాలియందు వుంచి దానిలో 2 సేర్ల యిసుకనుపోసి యిసుక బాగా వేడిఅయిన తర్వాత దానిలో ఒక చిన్నపాత్రనువుంచి పై బిళ్లలను 5 లేక 6 చొప్పున ఎర్రగా కాల్చవలెను. పైన సన్ననినిప్పును దమ్ము పెట్టవలెను.

## బరోటా

½ శేరు గోధుమపిండిలో 2 చంచాల పేరిననెయ్యిని వేసి అరచంచా మెత్తని ఉప్పునువేసి బాగా ముద్దగా నీళ్లతో కలుపవలెను. 2 గంటలసేపు నానినతర్వాత దానిని నిమ్మకాయంత వుండలుచేసి పలచగా పూరీవత్తి ఆ పూరీమీద నెయ్యిరాచి దానిని మడవవలెను మరల ఆ మడచిన దానిని పూరీలువత్తి కళాయిలో ఒక్కొక్కదానిని 1 చంచానెయ్యితో కాల్చవలెను.

## రవ పకోడీ

1 వంతు గోధుమనూకను 1 వంతు గోధుమపిండిని, 1 వంతు పెరుగుతో తడిపి దానిలో 1 చంచా కొట్టినవుప్పును 4 పచ్చిమిరపకాయలను సన్నగాతరిగి పులుపు యిష్టమున్నపక్షమున అరబద్ద నిమ్మకాయరసమునువేసి బాగుగాకలుపవలెను. బాణలిలో 5 ఫలముల నెయ్యిగాని, నూనెగాని మరగించి దానిలో పైపిండిని పకోడీలవలె వేసి దేవవలెను.

## రవ యిడ్లీ

½ శేరు గోధుమనూకను 5 ఫలముల నేతిలోవేయించి దానిని ¾ శేరు గడ్డపెరుగుతో తడిపి దానిలో ఒక చంచావుప్పును 6 పచ్చిమిరపకాయల ముక్కలను 1 తులం అల్లంముక్కలును 5 ఫలముల జీడిపప్పును వేయవలెను. 6 గంటలసేపు నానినతర్వాత దానిని కావలసినసైజుగా యిడ్డీనులు పెట్టవలయును.

—శ్రీమతి ఇమ్మానేని సావిత్రీదేవి.

## — రచయితలకు బహుమానము —

గోధుమధాన్యముతో వివిధములైన పదార్థములను తయారుచేయదగిన పద్ధతులను, ఇంతవరకు ప్రకటించినవిగాక క్రొత్తవి, సరియైన తూనికలతో, కొలతలతో మంచి అనుభవజ్ఞానముతో ఎక్కువ పదార్థములను వ్రాసిపంపినవారికి బహుమతి యొసంగబడును. కాన గమనింప కోరుచున్నాము.

# యుద్ధరంగము

● ఫ్రాన్సులో నూతనరాజ్యాంగము ● మధ్యధరాలో మంతనాలు
● ఇంగ్లండుపై జర్మనీ దాడి...? ● హిట్లరు శాంతి సూక్తులు

★ అరుంధతి ★

పశ్చిమఖండంలోని స్వతంత్రరాజ్యాల నన్నిటిని జయించి తన ఏకచ్ఛత్రాధిపత్యాన్ని నిరంకుశంగా సాగించి, ఒక నూతన జర్మను సామ్రాజ్యాన్ని స్థాపించాలనే దురాశతో హిట్లరు వరుసగా పోలెండు, నార్వే, హాలెండు, డెన్మార్కు, బెల్జియం, ఆస్ట్రియా, జెకోస్లవేకియా, లక్సెంబర్గు రాజ్యాల నాక్రమించాడు. హాలెండు, బెల్జియములు హిట్లరు కైవశమయిన తర్వాత ఫ్రాన్సు ఎంత బలవత్తర రాజ్యమైనా మాగినాటు దుర్గశ్రేణి ప్రక్కగా దారి ఏర్పడడంవల్ల జర్మనీ దాడి నెదుర్కొనవలసి వచ్చింది.

పారిస్‌వంటి చరిత్ర ప్రశిద్ధమైన మహాపట్టణాన్ని పూర్తిగా సంరక్షించుకొనడానికి ఫ్రెంచిప్రభుత్వం పారిస్‌కు 12 మైళ్ల దూరంలో జర్మనుదాడులను ఎదుర్కొన్నాయి. పరరాజ్యాలను జయించాలనే దురాశ ఫ్రాన్సుకు మొదటినుండి లేకపోయినా, స్వదేశ రక్షణార్థమై యావచ్ఛక్తిని వినియోగించడానికి కూడా సావకాశం లేకపోవడంవల్ల హిట్లరుయొక్క కుతంత్రాలకు, పశుబలానికి లొంగిపోక తప్పిందిగాదు.

## ఫ్రాన్సులో నూతనరాజ్యాంగము

హిట్లరుకు దాసోహమన్నప్పటినుంచి ఫ్రాన్సు రాజ్యాంగంలో అమితమైనమార్పు వచ్చింది. ఇన్నాళ్లనుంచి అమల్లోవున్న రాజ్యాంగము ప్రస్తుత నూతన పరిస్థితుల్లో ఫ్రాన్సుకు ఏలాటి ప్రయోజన కారి కాదని మార్షల్ పెటియన్ సర్వసేనాని, నియంతృత్వ పద్ధతిపై కొత్త రాజ్యాంగాన్ని నిర్మించాలనేభావంతో ఒక నూతన మంత్రివర్గాన్ని ఏర్పరచాడు. ఈ నూతన మంత్రివర్గంవారు నియంతృత్వ విధానంతో ఫ్రాన్సు యొక్క క్షేమాభివృద్ధికి పాటుపడడానికి కృషిచేస్తారట. అందుకు పెటియన్ సర్వాధికారాలు చలాయిస్తాడు.

ఈ నూతన రాజ్యాంగం ఫ్రెంచి ప్రజల ఆమోదాన్ని పొందడానికి వోట్లు తీసుకుంటారట. కాని ప్రజల్లో సుముఖభావం కనపడటంలేదు. కాని జర్మను జస్టపూవారు అప్పడే 17000 మంది ఫ్రెంచి ప్రజలను రహస్యంగా నిర్బంధించి పెటియన్ ప్రభుత్వానికి సుముఖతగా వోట్లనిచ్చేటట్టు చేస్తున్నారు. ఈ కుట్ర మొదలై బాగా సాగుతోంది.

ఫ్రాన్సులో యీ నియంతృత్వ విధానం క్రింద కొత్త మంత్రివర్గంయొక్క పరిపాలన రావటం హిట్లరు ముసోలినీలకు ఏమాత్రం ఇష్టంలేదు. ఇంతకాలంనుంచి ఫ్రాన్సు ఒక పారిశ్రామికదేశంగా వుంటూ వచ్చింది. ఇక ముందునుంచి వ్యవసాయకదేశంగా మారాలి. యూరప్ రాజ్యాలన్నీ వ్యవసాయకదేశాలై, ఆయాదేశాలనుండి ముడిపదార్థాలను పొందుతూ జర్మనీ ఒకపెద్ద పారిశ్రామికదేశంగా వుండాలని హిట్లరు కోరిక. ఈ సూత్రాన్నే హాలెండు, బెల్జియం, మొదలైన దేశాల్లో అమల్లోపెట్టాలని హిట్లరు ప్రయత్నిస్తున్నాడు.

### ● ఇంగ్లండుపై జర్మనీ దాడి...?

తనకు ప్రబల శత్రువై కూర్చున్న ఇంగ్లండు నెట్లాగునైనా యుద్ధంలోకిదించి, దాన్ని జయించి, తన ఏకచ్ఛత్రాధిపత్యాన్ని సాగించుకోవాలని హిట్లరు తగుమైనఎత్తులు వేస్తున్నాడు.

ఇంగ్లీషుఛానల్ దాటి అకస్మాత్తుగా జర్మను విమానాలు ఇంగ్లండు సముద్రతీరాన్ని బాంబులు విసిరిరావడమూ, ఆయుద్ధ విమానాలను బ్రిటిషువారు నాశనముచేయడమో, తరుమగొట్టడమో జరుగుతూవుంది. బ్రిటిష్ యుద్ధవిమానాలు జర్మనీలోనూ, జర్మనీ ఆక్రమించుకొన్న యితర ప్రదేశాలలోను, ఎచ్చటెచ్చట మందుగుండు సామానులు, నూనెస్టాకులు, ఆయుధాలు తయారుచేసే ఫ్యాక్టరీలు ఉన్నాయో, అక్కడక్కడ బాంబులువేసి నాశనం చేస్తూనేవున్నాయి. హాలెండులోను, రూర్ జిల్లాలోను, ఎమ్డెన్ నౌకాలయముపైన, సోల్టాన్ దగ్గరవున్న రైలు మార్గాలమీద, బొలోనువద్దనున్న యుద్ధ నావలమీద, డోర్నిస్ విమాన ఫ్యాక్టరీ మీద బాంబులువేసి జర్మనీకి కొంత నష్టం కలగజేశాయి. బ్రిటిష్ విమానాలు నిరంతరం ఈ దాడులను గావిస్తూ జర్మనీ ఇంగ్లండు పైకిరావడానికి చేస్తున్న ప్రయత్నాలనన్నిటిని దగ్ధపటలం చేస్తున్నాయి. కాలక్రమేణా ఇంగ్లండు తన సామ్రాజ్యంలోని దేశాలదగ్గరనుండి సంపాదించుచున్నబలం వృద్ధిఅవుతూండడం చూచి, తాను పూర్వంవేసుకున్న ఎత్తులప్రకారం ఇంగ్లండును జయించడందుర్ఘటంఅని తెలుసుకున్నాడుహిట్లరు.

ఇందుకు ప్రక్కదార్లు తొక్కితేనేగాని తాను జయించలేనని, యితరరాజ్యాలతోవున్న బ్రిటిషు సంబంధాలను చికాకుచేయడానికి తలపడ్డాడు.

### మధ్యధరాలో మంతనాలు

మధ్యధరాసముద్రంలో ఇంగ్లండుయొక్క పలుకుబడిని తగ్గించాలని ముసోలినీతో మంతనాల జరిపి, మధ్యధరాసముద్రంలోని బ్రిటిషు నావికాసంపత్తిని స్వదేశానికి పోకుండా జిబ్రాల్టరును స్వాధీనంచేసుకోవడానికి ప్రయత్నాలు చేస్తున్నాడు. అయినా ఆంగ్ల నౌకాబలం తన పూర్వ అధికారాన్ని మామూలుగానే సాగిస్తున్నది. ఇటలీ బహిరంగంగా ఇంతవరకు ఆంగ్ల నౌకాబలంతో పోరుకు సిద్ధపడలేదు. మాల్టా దీవిని ఆక్రమించుకోవడానికి విమానదాడులను గావించింది గాని సాధ్యమైందిగాదు. అయోనియా సముద్రంలో ఇటలీ నావికాబలాన్ని ఇంగ్లీషువారు తరిమివేశారు. ఎర్రసముద్రంలో ఇటలీ జలాంతర్గామి ఆంగ్ల నౌకాబలానికి నష్టం కలిగించాలని ప్రయత్నిస్తే దాన్ని పట్టుకుని ఏడెన్లో నిర్బంధించారు. సూయిజ్ కాలువలో వున్న ఫ్రెంచి నౌకల్ని ఇంగ్లండు తన ఆధీనంలోకి తెచ్చుకోవడంవల్ల ఇటలీకి నౌకాబలం పెంచుకోవాలన్న ఆశ అంతరించింది. అంచేత స్పెయిన్ యొక్క తాటస్థ్యాన్ని చెడదీసి, ఫ్రాంకోను యుద్ధంలోకి దింపి, జిబ్రాల్టర్ను స్వాధీనంచేసుకోవాలని ముసోలినీ ఎత్తులువేస్తున్నాడు. వెనుక స్పెయిన్ అంతర్విప్లవంలో యీ నియంతల సహాయం పొందినవాడు గనుక ఫ్రాంకో, ఇటీవల ఒక ఉపన్యాసంలో, 'ఆఫ్రికాలో వున్న స్పెయిన్ వలసరాజ్యాలతో స్పెయిన్ ప్రభుత్వానికి రాకపోకలు మొదలైన సంబంధాలు నిరాటంకంగా జరగాలంటే, స్పెయిన్కు జిబ్రాల్టరు స్వాధీనపడిపోవాలని తేల్చాడు. దీనికి దోహదమివ్వడానికి ఆగస్టు మొదటివారంలో ఫ్రాంకో ముసోలినీల సమావేశం జరుగుతుందని వార్తలు వస్తున్నాయి. ఈ విషయంలో ఫ్రాంకో ఇంగ్లండుతో యుద్ధానికి తలపడతాడో లేదో చూడాలి. ఇదేకాకుండా, జర్మనీ ఇంగ్లండుపై దాడిసల్పిన మరుక్షణంలో జిబ్రాల్టరును స్వాధీనంచేసుకొని మధ్యధరాసముద్రంలో నుంచి బ్రిటిష్ నావికాబలాన్ని స్వదేశానికి రాకుండా చేసేటట్టు జర్మనీ గూఢచారులు స్పెయినులో ఫెలంగిస్టు పక్షంవారితో ప్రయత్నాలు చేస్తున్నారు.

# యుద్ధ రంగము

అటు ఆఫ్రికాఖండంలో బ్రిటిష్ వలసరాజ్యాలవారికి, ఇటలీ వలసరాజ్యాలవారికి మధ్య నిత్యం పోరాటం జరుగుతూనే వుంది.

ఇటు ఐర్లండులో వ్యవహారాలు చక్కబడే సూచనలు కనపడుతున్నాయి. రష్యా బాల్టిక రంగంలో తన బలాన్ని వృద్ధిచేసుకుంది. రష్యాకు ఇంగ్లండుకు చెడినట్లు కనపడిన వ్యవహారాలు సఖ్యతగా పరిణమించునట్లు కనపడుతున్నాయి.

ఇంతలో నిత్యం జరుగుతూవున్న బ్రిటిషు నౌకాతీరాలయందు జర్మను దాడులను బ్రిటను చిందర వందర చేయడమే కాకుండా జర్మను దాడిని ఎదుర్కొనడానికి ఏర్పాట్లుచేసినట్లు ప్రకటించింది. స్వసంరక్షణకు కట్టుదిట్టాలు చేసికోవడమే కాకుండా, దాడుల పద్ధతినే అమల్లో పెట్టడానికి, జర్మనీవారు దాడులు రాకుండా వారికి అవరోధాలు కల్పించడానికి బ్రిటిషువారు కృషిచేస్తున్నారు.

## హిట్లరు శాంతి సూక్తులు

ఇట్టి పరిస్థితులో శాంతిసూచనలు కావిస్తే తన ప్రయత్నాలు ఫలిస్తయ్యేమో నని హిట్లరు గత వారం రిచిస్టాగులో ఉపన్యసిస్తూ, ఆంగ్లసామ్రాజ్యాన్ని నాశనంచెయ్యడం తన అభిమతంగాదని, ఇంగ్లండు ఐరోపాఖండ వ్యవహారాల్లో జోక్యం కలగజేసుకోకూడదని, ఐరోపాలో జర్మని సర్వాధికారి అని గుర్తించాలని, యీ శాంతికి వప్పుకోకపోతే జర్మనీయొ, ఇంగ్లండో అంతమయ్యేవరకు యుద్ధం తీవ్రరూపాన్ని దాల్చిస్తానని బెదిరించాడు.

కాని యీలాటి ప్రగల్భోక్తులకు బ్రిటిషు సింహం గడగడలాడుతుందనుకున్నాడు గావి, గర్జించింది. ప్రజాస్వామ్య రాజ్యస్థాపనకు ఇంగ్లండు నడుంకట్టుకుందనీ, దాన్ని సాధించేందుకు చివరవరకు పోరాటం సాగిస్తుందనీ హెచ్చరిస్తూ హాలిఫాక్సుప్రభువు జర్మనీకి సమాధానం ఇచ్చాడు. రాక్షసప్రభుత్వంవారి ఇటువంటి సూచనలను ఇంగ్లండు ఒక్కనాడు ఒప్పుకోలేదు. ఐరోపాలో ఏ ఒక్కరాజ్యంగాని సర్వాధికారం కలిగివుండడం ఇంగ్లండు అభిమతంగాదు.

ఉత్తరాన్ని నార్వే సముద్రతీరాన్నించి, ఇటు హాలెండు బెల్జియం కోస్తానుంచి విమానదాడులు, నౌకాబలంతో ఒక్కసారిగా ఇంగ్లండుమీద విరుచుకుపడడానికి సుమారు 6 లక్షల సైనికులు సిద్ధంగావున్నట్టు ఇటీవల జర్మనీ, ఇటలీ పత్రికలు ప్రచారంచేస్తున్నాయి. ఈ బెదిరింపులకు ఇంగ్లండు లొంగిపోతుందని హిట్లరు ముసోలినీలు తలుస్తున్నారు. కాని ఇంగ్లండు ప్రతిదినం దాడి గావిస్తూ, శత్రువులయొక్క బలాన్ని ఎక్కడేవిధంగా వున్నదో తెలుసుకుంటూనే వుంది. జర్మన్ మంత్రివర్గంలో ఇంగ్లండుపై దాడివిషయంలో పొరపొచ్చాలు పుట్టాయనికూడా తెలుస్తోంది. అసలు నిజమేమంటే, నాజీ నాయకులు ఇంగ్లండుపై దాడి జయప్రదంకాదని గ్రహించుకుని యీలాటి అభూతకల్పనలకు దిగి ప్రచారంచేస్తున్నారు. కాని ఇంగ్లండు మొక్కవోని ధైర్యంతో నిలబడేవుంది. (28-7-1940)




**అఖిలభారత మహిళా మహాసభ**

అఖిలభారత మహిళామహాసభ ఇటీవల ఢిల్లీలో సమావేశమై ఉత్తేజకరములైన తీర్మానములను గావించినది. అధ్యక్షతవహించిన శ్రీమతి బీగం హమీదాలీగారు తమ అధ్యక్షోపన్యాసములో స్త్రీజనాభ్యుదయకరమగు హక్కులను ధర్మముగా వారికొసంగుటకు పురుషులు అంగీకరింపకున్నారనియు, అట్టి హక్కులను సంపాదించుటకై స్త్రీలు అవసరముకలిగిన 'సత్యాగ్రహము' సల్పుటకుగూడ సంసిద్ధులై యుండవలెననియు హెచ్చరించిరి.

ఈ హక్కులవిషయమై ఇట్టివి, ఇంతవరకు అని నిర్వచించుటయే కష్టము. సాధారణముగ యీ హక్కులనునవి ఒకరిచ్చునవి, వేరొకరు పుచ్చుకొనునవి అను సంబంధము స్త్రీ పురుషుల నడుమ పేర్కొనుట అర్థములేనిది. అందును భారతజాతికి ఇటువంటి ప్రత్యేకమైన కట్టుబాట్లేమియు లేవు.

ఎవరికి ఎట్టిహక్కులు కావలసినను అవి వారి స్వయంకృషిపైననే ఆధారపడియుండును. తత్ఫలితముగ వారివారి హక్కులు వారివారికి నిర్ణీతములైపోవును. ఇందొకరి యాటంకముగాని, అపహాస్యముగాని వుండనేరదు. ఇది నైతికముగ స్త్రీ పురుషు లొండొరులు, సమరసభావముతో, జాతిశ్రేయస్సునే ప్రధానలక్ష్యముగ నెంచి నిర్ణయించుకొనవలసినదే గాని నిర్బంధమువలన గాదు.

కాని, దీనికి భిన్నముగ నేటి మన సంఘజీవితమున యీ సామరస్యము కరువైపోయినది. స్త్రీ కేవలము ఆర్థికబలహీనగ విశేషించి విద్యావిహీనగ జేయబడినది. మూర్ఖపు పట్టుదలలు మితిమీరి, స్వార్థపరత్వమువలననో, మరి స్వాభిమానమువలననో కాని, అజ్ఞాన తిమిరము జాతిలో దినదినము వృద్ధియై ఘనీభవించుచున్నది. దీనికి ప్రత్యేకముగ పురుషుల లోభత్వమే కారణమనిన సత్యదూరముగాదు.

ఇందు విషయమై నారీలోకము తమ జాతిశ్రేయస్సు గోరి, తగువిధమున పాటుబడి, వారి జన్మహక్కులను సాధించి, సంపాదించుటకు గడంగుటలో తప్పేమియును లేదు. అందుకొరకై వారు పలువిధముల ప్రయత్నింపవచ్చును. వాటిలో హింసాదూరమగు సత్యాగ్రహసూత్రము మాత్రము సమ్మతము కాకూడదా?

ఈవిషయము మహాసభా తీర్మానములందు కన్పడుటయే తడవుగా పలువురు పలువిధముల వ్యాఖ్యానముల చేయ తలపడినారు.

'ఇండియన్ ఎక్స్‌ప్రెస్' పత్రిక తన సంపాదకీయ వ్యాఖ్యలో స్త్రీలు, వారికితగిన బాధ్యతాయుతమైన పదవులనిచ్చినను వాటిని బాగుగ నిర్వహింపలేకపోయిరనియు, ఉదాహరణకు మద్రాసు ఎసంబ్లీని ఎత్తుకొని అచ్చట స్త్రీ సభ్యులు 'తమది' అని పేర్కొనదగిన కార్యములుగాని, బిల్లులుగాని తేలేకపోయిరనియు, ఏమేమియో వ్రాసినది.

నిజమునకు మద్రాసు మంత్రాంగములో వ్యక్తుల ప్రత్యేకత ఏమియును లేదు. 'ఏకనాయకత్వము' 'ఏకాభిప్రాయము' పైననే పరిపాలన జరిగినది. అందు పురుషులకే స్థానములేనప్పుడు స్త్రీలకు తావెక్కడ? శ్రీమతి గంధం అమ్మన్నరాజాగారి దేవదాసిబిల్లు బయటకు రాకుండగనే మద్రాసు మంత్రాంగము విరమించినది. ఈ విషయమెల్లరకు విదితమేగదా? ఇప్పట్టున ఒకరిని ప్రత్యేకముగ హీనపరచుటకు తావులేదను విషయము యీ పత్రికా ప్రముఖులకు తెలియదా?

'మద్రాస్ మెయిల్' పత్రికగూడ, 'వంటయిల్లు మొదలగుచోట్ల సత్యాగ్రహమొనర్చిన స్త్రీలు తమ హక్కులను సంపాదించగలరని' హేళనచేసినది. 'వంటచేయమనియు, సంసారములను సరిదిద్దమనియు' స్త్రీలెన్నడును చెప్పియుండలేదు. వారి విషయమున జరుగవలసిన న్యాయము ధర్మముగా జరుగకున్న బాధ్యత వహించిన ప్రభుత్వముతో సత్యాగ్రహము చేయుదుమని మాత్రమే చెప్పియున్నారు. ఇందు న్యూనతగా వ్రాయవలసిన విషయము లేదే! దీనికి వేరువిధముగా అర్థముచేసుకొని అవకతవక ప్రసంగములకు దిగిన 'మెయిల్' పత్రిక తన సంకుచితస్వభావమును బయల్పరచుకొనినదే గాని వేరుగాదు.

తమకు సహజముగా రావలసిన హక్కులకొరకై ఎన్నివిధముల ప్రయత్నించినను ఫలితములేనప్పుడు యీ ధర్మాస్త్రమును ప్రయోగించెదమనుట న్యాయదూరముగాదు.

ఇట్లూరకుండుటవలననే గదా మద్రాసునందున్న రెండు మెడికల్ కళాశాలలయందునుకూడ— అసలు వైద్యవృత్తిలో స్త్రీలకు ప్రత్యేకసమర్థతయున్నను—స్త్రీలకు సరియైన స్థానములు లభ్యముకాలేదు! ఇదియేగాక—స్థానిక స్వపరిపాలనా శాఖయందు, విద్యాశాఖయందు, తదితర విషయములందునుగూడ అమితమైన అన్యాయము జరుగుచున్నదే! ఇట్టి అధర్మము నిత్యము హెచ్చుగుచుండుటవలననే మహిళాప్రపంచము నేడు కొంచెము తీవ్రప్రక్రియ చేయ తలపడినది. ఇది వివేకదూరమని కొందరు వివేకులు వ్యాఖ్యానముచేయుటలో వారి యవివేకము గన్పడుచున్నది గాని అన్యముగాదు.

ప్రస్తుత సమాజమందున్న బ్రాహ్మణ బ్రాహ్మణేతర తగవులవలెను, హిందూ మహమ్మదీయ అసఖ్యతవలెను స్త్రీ పురుషుల నడుమకూడ అనవసరమైన విభేదముల గల్పించి జాతిని ఛిన్నాభిన్నముచేసి, అశాంతిని రేకెత్తించకుండ యీ విషయములను సమరసభావముతో చక్కబరుచవలసియున్నది. ఇందులకు సంఘము వెనువెంటనే పూనుకొని కార్యరూపమున బెట్టుట ఎంతయు ధర్మము.

ఉత్తేజకరములును, సాహస ధైర్యోత్సాహపూరితములును అగు శక్తివంతములైన తీర్మానముల గావించిన మహిళామహాసభవారు అభినందనీయులు.

వెనుకటివలెనే కార్యరూపమునందని తీర్మానములవలె గాక, యీతూరి సరియైనమార్గ మనుష్ఠించి అఖిలభారత మహిళా మహాసంఘమువారు ఆదర్శనీయులౌదురుగాక యని విశ్వసించుచున్నాము.

## బాల్యవివాహ నిరోధచట్టమునకు సనాతన సుడిగాలి

ఇప్పటికి రెండు సంవత్సరములకు పూర్వము నైజాము సంస్థానమునందు హిందూవితంతు వివాహము చట్ట సమ్మతమైనది. తిరిగి అట్టి వేరొక సంస్కరణమును బొందగలుగు భాగ్యము హైదరాబాదు హిందువులకు కలుగనున్నది. బాల్యవివాహముల నరికట్టుటకొక చట్టమునుచేయ సంస్థానము తలపెట్టి పనిచేయుచున్నది.

[illegible]జామ సంస్థానమునందు హిందువులలో అతి బాల్యవివాహము లతి మిక్కుటముగ జరుగుచున్నవి. [illegible] బ్రాహ్మణాది అగ్రకులములందివి విపరీతముగ వృద్ధిజెందియున్నవి.

బ్రాహ్మణేతరులం[illegible] బాల్యవివాహములున్నప్పటికిని, కొందరిలో వితంతుబాలికలకు పునర్వివాహములు జేయుటాచారమున్నది. బాలికలకు యుక్తవయస్సురాకముందే ఇట్టి పునర్వివాహములు రెండు మూడు కూడ జరుగుచున్నవన్న యీ బాల్యవివాహపిశాచమెంత విలయతాండవము జేయుచున్నదో యూహించవచ్చును.

బాల్యమునందే [illegible]వైన బాలికకు తిరిగి బాల్యవివాహమునే గావించు తల్లిదండ్రుల దురాచార [illegible]వివాహమునకు పవిత్రత యెక్కడ?

[illegible]హము లాచారములందులేని బ్రాహ్మణాదికులములందలి వితంతుబాలికల దుర్భర [illegible]రములు సంఘమునవినీతికూపముగ జేయుచున్నవి.

[illegible]యవినీతిని, అశాంతిని వెనుకనిడుకొని, ఇట్టి శాసనములవలన హైందవమతము గంగలో [illegible] [illegible]న్నిని రక్షించుట కనుసెపముతో, ఆచారముపేర, మతముపేర యీ శాసనమును నిరోధిం[illegible] [illegible]ముఖులు తీవ్రప్రయత్నములతో దాడిసల్పుచున్నారు.

[illegible]ములను, దినపరి బత్యములనుకూడనిచ్చి కొందరిచే ప్రతిపల్లెయందును ప్రచారముగావించు విపరీత [illegible] సంసిద్ధులగుచున్నారనిన, వీరి యవివేకమునకు, మూర్ఖతకు పారము గలదా? వీరి యజ్ఞానతిమిర [illegible]రంధ్రోలు జ్ఞానప్రభాతము ప్రసాదింపబడుగాక యనికోరుటదప్ప వేరేమి చేయగలము?

[illegible]లం స్వదేశసంస్థానములందు సంఘసంస్కరణమును గోరు సంస్క[illegible]. పునర్వివాహమును గావించుకొనుచు, నవయుగ నిర్మాణమునకై జాతిముందుకు పర్వులెత్తుచుండ సంస్థానము లందు [illegible]కేని ఇట్టి చైతన్యము గానరాదు. ఎన్నడో వచ్చియుండవలసిన యిట్టి సంస్కరణములు ఇప్పటికైన వచ్చి[illegible]డు హర్షము జూపవలసినదిమాని ఆగ్రహము జూపుట ఏటివివేకము?

స్వదేశ సంస్థానములందు అగ్రస్థానమువహించిన హైదరా[illegible]సంస్థానమునం దిట్టివి ఇంకను కొనసాగుట క్షేమకరము గాదు.

ఈ బాల్యవివాహ చట్టము [illegible]గాని వెనుకటి వితంతువివాహ చట్టమునకు తగిన బలము సమకూరదు. కాన వెనుకటి చట్టసందర్భమున [illegible]ప్పుడుగూడ యీ సనాతన సుడిగాలినో ప్రజలు, ప్రభుత్వము కూడ ఎదుర్కొని హింసాకూపమున బడిపోవుచున్న బాలికల నుద్ధరింతురుగాక! ప్రభుత్వము ఇందుకు తగిన శ్రద్ధబూని, సనాతనుల చాంధసమును విస్మరించి, చట్టమును త్వరలో ప్రసాదించునుగాక [illegible] విశ్వసించుచున్నాము.

Edited by Dr. K. N. Kesari, Printed and Published by Dr. S. Seshagiri Rao
at the Lodhra Press, 15, Westcott Road, Royapettah, Madras.

374